Roy, Dwijendra Lal, 1864-1913

సోరాబు రుస్తుములు

రాజమండ్రి, 1925

Record no. 455

Roy, Dwijendra Lal, 1864-1913

Sōrābu Rustumulu

Rājamaṇḍri, 1925

Record no. 455

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

Roy, Dwijendra Lal, 1864-1913.

సోరాబు రుస్తుములు / ద్విజేంద్రలాల్రాయని వంగనాటకమునకు తెనుగు ; గ్రంథకర్త శ్రీపాద కామేశ్వరరావు.- 1. కూర్పు.- రాజమండ్రి : చెఱకువాడ వేంకటరామయ్య, 1925.

83 p. ;21 cm.

Record no. 455

Roy, Dwijendra Lal, 1864-1913.

Sōrābu Rustumulu / Dvijēndralālrāyani Vaṅganāṭakamunaku Tenugu ; granthakarta Śrīpāda Kāmēśvararāvu.- 1. kūrpu.- Rājamaṇḍri : Ceṟakuvāḍa Vēṅkaṭarāmayya, 1925.

83 p. ;21 cm.

Record no. 455

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB    Date filming began:

# సోరాబురుస్తుములు

1775

ద్విజేంద్రలాల్ రాయుని వంగనాటకమునకు తెనుగు.

గ్రంథకర్త:

శ్రీపాద కామేశ్వరరావు.

మొదటికూర్పు




ప్రకాశకుడు

చెఱుకువాడ వేంకటరామయ్య

అభినవాంధ్రగ్రంథమాలాకార్యాలయము

రాజమండ్రి.

1925

సర్వస్వామ్య సంకలితము. వెల రు 0—12—0

పుట్టి పెరిగితి వాఁరేండ్లై పుత్త్రుఁడవయి
విద్దె బుద్ధుల రూపాన వెలసి తీవు,
ముద్దు ముచ్చటఁ దీర్పంగ మురిసినాము
తండ్రి! పితరులయెడ దయతప్పనౌనె?
పాపులము గాన మము రోసి పాసి తీవు
తీర్చుకొంటివి నీయప్పు; తీర్తు నేను
మాకడుపు తీపిఁ గృతిచే ఉమామహేశ॥

# పీఠిక

ఈ నాటకము గద్యపద్య గీతాత్మకమగుట వంగభాషను "నాట్యరంగమ"నియు, "నాట్యరాసకమ"నియు వాడఁబడుచున్నది. గీతికలనుండి రసవంతములగు భావముల కొన్నిటిని మాత్రమే యెంచి గద్యపద్యభాగములయం దక్కడక్కడ చిన్న మార్పులు చేసి తెనిగించితిమి.

ఇందలి కథ ఫర్దూసి అను పారసీక కవివరేణ్యుని "శాహ్‌నామా"అను గ్రంథములోనిది; తృతీయాంకభాగము మాత్రము మాత్యు ఆర్నాల్డ్ అను ఆంగ్లకవివరునిచే పద్యరూపమున రచింపబడి సర్వజనానుమోద మందుచున్నది.

స్వర్గీయ ద్విజేంద్రలాల్‌రాయని గ్రంథముల నన్నిటిని తెనుగుజేయ మాకనుమతి నొసంగిన వారి పుత్త్రులు శ్రీయుత దిలీపకుమారరాయలుగారికిని, వంగనాటకమును మాకధ్యాపన మొనర్చిన శ్రీమాన్ రాధాగోవిందదాసు మహాశయులుగారికిని, మాఅనువాదమును పెక్కుచోటుల జయప్రదముగా ప్రదర్శించిన శ్రీరామవిలాస నాటకసంఘము (తెనాలి) వారికిని మాకృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాము.

రాజమండ్రి.
20—9—1925

చెలుకువాడ వెంకటరామయ్య.

# కుశీలవగణము.

—:o:—

## పురుషులు.

| | |
|---|---|
| రుస్తుము | పారసీక వీరుడు |
| సోరాబు | రుస్తుము కొడుకు. |
| కైకాయుసు | పారసీక (ఇరాన్) రాజు |
| రాజు | తార్తార (తురాన్) రాజు |
| గుస్తాహాము | ఇరాను దుర్గాధ్యక్షుడు. |
| హుజీరు | గుస్తాహాము సేనాధిపతి. |
| హుమాన్, వర్మాన్ | తార్తార సైన్యాధ్యక్షులు |

ఇంకను కొందరు వత్తురు.

## స్త్రీలు.

| | |
|---|---|
| తామినా | రుస్తుము భార్య (తురాను రాజకన్య.) |
| ఘ్రిఫిద్ | గుస్తాహాము కూతురు. |
| రాణి | ఇరానురాజు భార్య. |

ఇంకను సఖులు కలరు.




## మొదటి అంకము.

### మొదటి రంగము.

(తురాను దేశారణ్యమున నదీతీరమున పారసీక వీరోత్తముడు రుస్తుము నిదురపోయి మేల్కాంచును.)

రుస్తు—ఈ కుంజతరునివహ శాఖలు పుష్పభరితములయి కనువిందొనర్చు చున్నవి. వానిమధ్య కుహూకుహూ ధ్వనుల జేయుచు కోయిలలు వనమునంతయు ముఖరిత మొనర్చు చున్నవి. సంధ్యావేళ శాంతిభూయిష్టమై మనము నలరించు చున్నది. మందసమీరము తీయని కాసారజలబిందు సిక్తమై చిరవికసిత పుష్పపల్లవ సంకలితమగుటచే సౌరభభారము మోసుకొని పోవుచున్నది. పక్షిగణము నోట నెద్దియో యిరచుకొని గూళ్ళకు చేరబోవుచు ఆనంద సూచకమగు కలస్వనముచే దశదిశల మ్రోగించు చున్నది. అగణిత తారాగణము సాజపుసిగ్గున అవగుంఠనమును మెల్లగా తీయుటచే మినమిన లీనుచున్నది............చంద్రికావర్షమిక కురియు నున్నది. ఈ యుజ్వలదృశ్యమును చూడ మానవుని హృదయమున అసంఖ్యాకములగు సుసంకల్పములు ఉదయించవా? అనంత బ్రహ్మాండమున మానవకోటి అన నెంత? సృష్టి

వైచిత్ర్యమును సాంతముగా నెఱుంగ వశమా? ఆహా! ఏమి సృష్టికర్త మహిమాప్రభావము!

(ఇద్దరు పురుషులు వత్తురు.)

ఓహో! చీకటి పడుచున్నది, ప్రయాణము సాగింప వలయు.........ఎవరు మీరు?

1. పురు.........అయ్యా! మేము సన్నిహిత గ్రామ వాసులము, విలాసార్థ మిటు వచ్చితిమి.

రుస్తు—మీ పేరులు?

2. పురు—వాటి నెరుంగుట వలన మీ కధికతర పరిచయము కానేరదు. అడుగ నేల?

రుస్తు—ఇది యే రాష్ట్రము?

పురు—తురాను రాజ్యము.

రుస్తు—అబ్బా! వేటతమకంబున ఎంతదూరము వచ్చితిని! ఇప్పుడు మారాజ్యమునకు బోవనెంచుట సుకరము కాదు....ఈ దేశమునకు రాజధాని యేది, ఇచటి కెంతదూరమున నున్నది?

1. పురు—రాజధాని సమరఖండము — చేరువనే యున్నది.

రుస్తు—సమరఖండము రాజధాని అని వింటిని.

2. పురు—మేము కృతార్థులము. అచటికే పోవుచున్నారము.

రుస్తు—ఆగుడు_నేనుకూడ మీవెంట వచ్చెదను.... నా గుఱ్ఱము రాకూళ మేది?



2. పురు—నిద్దురపోవుటకు ముందు దానిని మా కప్పగించితివా? వెదకుకొనుము.

1. పురు—పొద్దుపోయినది, మేము పోయెదము.

(వెళ్ళును)

రుస్తు—ఎంత మూర్ఖులు! పరిణామమేని చేయక పోయిరి!....పోవునపుడు పరిహాసక మాడిరి!........నా ప్రభావము వీ రెరుగరు. అశ్వ మేమై యుండును? (పోవును.)



రెండవ రంగము.

(పారసీక రాజు కైకాయుశు-రాణియు)

రాణి—బర్బరులగు తార్తారులచే పరాజితులైతిరి, ఇదియా మీ ప్రతాపము? నిజరాజ్యమునుండి పలాయితులై శృగాలమువలె ప్రతాడితులైతిరా?........పారస్యరాజులో మీరు!

కైకా—తార్తార దస్యుడు దుర్ధర్షవీరుడు దుర్మతియు నగు ఆఫ్రిసియాబు నాడు వీరాగ్రేసరుడగు రుస్తుముచే ప్రతాడితుడై, కసి తీర్చుకొనుటకు తగిన కాలమునకై కాచియుండి రుస్తుము మృగయానిరతుడై దూరస్థమగు వనాంతరమున కేగెనని విని, ఇదే తఱియని, వర్షపువున నాపై దాడి వచ్చెను. మే మనాయత్తులమై యుంటచే వాని కోడి___

రాణి—వాని ధాటి కోర్వలేక వనముల బట్టితిరా? ఎంత సిగ్గుమాలిన పని! మీ రాజ్యమునకు రుస్తుముపరా

క్రమ మొకటియే ఆధారమని మీ రెంచినచో, ఈ సింహాసన మాతని కర్పణము చేయుటయే మేలు. క్షీణ వికంపితము లగు మీ హస్తములతో అశక్తుడగు వృద్ధునివలె రాజదండమును ధరింపనేల? రుస్తుము బాహుబల సాహాయ్యమున రాజ్యపాలనము సేయుట మీ కేమిగొప్ప? భూభారనిర్వహణ మాత్ర డొనర్ప వీరునకు రాజులై మీరు రాజిల్లుచుందురా? ఎట్టి తలవంపులు! ఇదియా మీ యశము? మీ ప్రజ లేమైరి?..... సైన్య మేమాయె? ధన మేమాయె? పౌరుష మెక్కడకు పోయె!

కైకా—ప్రాణేశ్వరీ! ఈ తార్తారు లొక్కరే నాకు శత్రువులు కారు. నా రాష్ట్రమందలి ప్రజలు కొందరు నా పరిపాలనము నెడ విముఖులై, ఈ యుద్ధమున తార్తారులకు సాహాయ్యమొనర్చిరి; లేకున్న ఇంత పరాజయము ఘటిల్లి యుండదు.

రాణి—నాథా! నీప్రజ లట్లు చేయుటకు హేతువేమి? ఇందెవరు దోషులు, నీవా, వారా? నీప్రజలు నిన్నూరక ఎదిరించి విదేశీయులతో కలియుదురా? నిసర్గమిత్రులు, నిరీహులు నగు వారు నీకు శత్రువు లగుటకు హేతువేమి? అత్యాచార ఘూర్ణిత నిర్ఘృణ శాసనకలిత రోషరక్త దృష్టియు, సర్వస్వలుంఠన వ్యస్త హస్తములు, లాలసోద్దీపిత పారస్య లలనాలింగన లాంఛితంబగు వక్షమును గలనీవు ప్రజల నిరాదరణకు భాజనంబగుట ఒక వింతయా? వారు నీకు కేవల భోగసామగ్రి



యనుకొంటివా? నీ లాలసాశకటమును పారస్యపృథ్వీ వక్షముపై నింతకాలము నిరాటంకముగా నీడ్చుటకు రుస్తుమను నేర్పరియగు చోదకు డుండెగాన నీయాటలు సాగుచుండె. ఆతని ప్రతాపసూర్యునియందు నీ యవగుణములను లాంఛనము లుండినను తద్రాజభక్తిప్రభలచే నీవును దుర్నిరీక్ష్యుడవైతివి. ఇప్పు డాతడు మృగయాగ్రహగ్రస్తుడగుటచే నీమాలిన్యము తేటబడినది.

రాజనీతి యన నేమనుకొంటివి? నీప్రజల నీవు ప్రేమింతువేని వారు నిన్ను ప్రేమింతురు, నీవు వారిని నిరాదరించిన వారునిన్ను త్యజింతురు. వారియెడ రోషము రోతయు కన్పరచి వారిభక్తిని గడించుట అసాధ్యము. "యథా రాజా తథా ప్రజాః", అని వినవె?

కైకా—దేవీ, నీవనునది సత్యము. సింహాసనమును ఈ సారి పొంద గల్గితి నేని ప్రజాప్రీతియే దానికి భిత్తిగా నొనర్తును. ప్రజలకు కళ్యాణము గూర్చుటయే నాకు నిత్య సాధనగా నెంతును.

రాణి—నీకు జయము చేకూరి నీ అభిలాష సఫలమగుగాక!........ (పోవును)

కైకా—ఇంతకుమున్నె యీచిరంతన మహావాక్యము నెఱుంగుదును కాని అధికారగర్వమున మరచితిని. ఐశ్వర్యమదాంధత అట్లు చేసెను. దుష్ప్రవృత్త్యావేశుడనై, ఆత్మసుఖమే కాని అన్యయమును కాంక్షింపనైతిని,

(సేనాధిపతి వచ్చును.)

సేనాధిపా, సంధాన మొనర్చితివా?

సేనా—చేసితిని. రుస్తుము తురాను ప్రాంతమున మృగయానిరతుడై యున్నాడని మన వేగులవలన తెలియ వచ్చినది.

కేకా—అతనికి శీఘ్రముగా ఈసమాచార మందజేసి పారసీకరాజు నగు నేను ఆతని మనోవేగమున మగుడరమ్మని మనవి చేసుకొంటినని ఈక్షణమే చారుల నంపుము. విలంబనము వలదు.

సేనా—చిత్తము. (వెళ్లును)

---

## మూడవ రంగము.

—:o:—

(సమంఖుండ రాజసభ—రాజు, సభ్యులు, విదూషకుడు)

రాజు—న్యాయవిచారణమున నేను సమదర్శకుడను.

సభ్యులు—ధర్మసూక్ష్మజ్ఞులగు న్యాయదేవతా వతారులు ప్రభువువారు.

రాజు—విదూషకా, నీ వేమందువు?

విదూ—ప్రభువువారి న్యాయపాలనా దక్షతను గాంచియే దయామయుడగు పరమేశ్వరుడు తా నీరాజ్యమున నుండుట అనావశ్యకమని యెంచి వెడలి పోయెను

రాజు—అటులనా? ఎటు పోయెను?



విదూ—ఏ చరిత్రలయందును ఆ యంశము వ్రాసి యుండలేదు కాని ఇరాను రాజ్యమునకు పోయియుండనోపు.

రాజు—ఔను. ఇరాను రాజగు కైకాయుస్ భయానక అత్యాచారుడని విందుము.

1 సభ్యుడు—అతడు దోపిడి కాడు, ప్రజాస్వాపహారుడు.

రాజు—వానికి రాజ్యపాలనా విధానము తెలియదు.

సభ్యు—నిజము. సత్యము. బొత్తిగా తెలియదు.

విదూ—ప్రభువువారు ఒక రాజ్యశాసన కళాపాఠశాలను స్థాపించిన మేలగునని తోచుచున్నది.

రాజు—అటులనా?

విదూ—ఔను. ఉదార రాజనీతిప్రచార మెట్లు కావింపవలయునో, తద్విపరీత కార్యక్రమ మెట్లు దృష్టాంతపరుపవలయునో తెలుప వచ్చును.

రాజు—అది సంభవమా?

విదూ—సంభవము కాకేమి? లేకున్న యుద్ధమున ప్రాణములను త్యజించుట, రణభూమినుండి అందరికన్నముందు వెన్నిచ్చి పారుట—మొదలగు విషయముల నే[illegible]వా రేరీ?

రాజు—నీవు నన్ను పరియాచక మాడుచు[illegible]వు.

విదూ—ప్రభువువారు గ్రహింప గలిగిరా[illegible]

రాజు—ఇరానురాజు నాపై దాడిచేసినప్పుడు ప్రప్రథమమున నేను పలాయితుడను కాలేదా? అప్పుడు—

విదూ—మీరా. రెవ్వనిచే పరాజితులైతిరి?

రాజు—వీరాధివీరుడగు రుస్తుముచే—

సభ్యు—ఔనౌను ! రుస్తుముచే !

రాజు—ఆ యుద్ధమున రుస్తుము పారసీకరాజునకు బాసటయై నిలువకున్న కైకాయుశుని పీచ మడచి యుందును. నా పేరు వినిన వాని కడలు !

సభ్యు—వాని మొగమునకు యుద్ధ మొకటియా ?

విదూ—ప్రభువువా రారాజుతో వైవాహిక సంబంధ మొనర్చిన ప్రశంసనీయముగా నుండును.

రాజు—ఈ ప్రపంచమున వీరులము-నేను-రుస్తుమును.

సభ్యు—సందియమా ? వీరులన్న మీ రిద్దరే !

విదూ—ప్రభువువారితోగూడ రుస్తుమును కలిపి చెప్పుటచే ప్రభువువారు వినయశీలత నభినయించితిరి.

రాజు—అట్లు కాదు. రుస్తుముకూడ వీరుడే.

సభ్యు—సందేహమా ? వీరాగ్రేసరులలో నొకడు.

విదూ—సృష్టికర్త వీరత్వమును సృజింపనప్పుడు దానిని మూడుముక్కలు చేసి మూడోడలలో నింపి పృథ్వీకం పెను; అందొకటి మహారాజు గారికిని, రెండవది రుస్తుమునకును అర్పించి, మూడవదానిని ప్రపంచమందలి వీరులకెల్ల పంచి యిచ్చెనని శాస్త్రములు ఘోషించు చున్నవి.

రాజు—అట్లైనా ? శాస్త్రము లసత్యము కావు.

విదూ—పృథ్వియం దన్నిప్రశ్నలకు ఉత్తరము కలదు కాని ఒక్కదానికి మాత్రము కానరాదు.



రాజు—అదేది ?

విదూ—ప్రభువువారికి రుస్తుమునకును యుద్ధమైనచో ఎవ రెవరిని జయింతురు ?

రాజు—మల్లయుద్ధమున నాకు తగినయోద్ధ అగు నేమో కాని శస్త్రయుద్ధమున సాటిరాడు.

విదూ—ఇంత సులభముగా నిర్ధారితము కానేరదు-ఇది కఠినప్రశ్న.

రాజు—ఇంకొకటి-రుస్తుము బుద్ధిహీనుడు, మరి నా బుద్ధి !—ఎట్టి బుద్ధి ?

సభ్యు—సచరాచరములం దెందును కాంచబోము.

రాజు—విదూషకా ! నీ వేమందువు ?

విదూ—ప్రభువువారి బుద్ధినుండి సారము తీయుటకు ఒక యంత్రాగారము (factory)నిర్మించిన బాగుండునని నాకు తోచుచున్నది.

రాజు—నీవు హాస్య మాడుచున్నావు. (అందరు నవ్వుదురు)

(తెరలో రుస్తుము ! రుస్తుము !)

రుస్తుమా! ఏమిది ? రుస్తుము నాసభకు రా గతమేమి ?

విదూ—నా ప్రశ్న కుత్తరము నేడు తెలియగలదు.

రాజు—ఆఁ నాకేమి భయము ? భీతిలేదు, గీతిలేదు; ఆతడిటేల వచ్చును !—ప్రమాదము రాదు కదా ? (దాగియుండును.)

(క్రోధముతో రుస్తుము వచ్చును)

రుస్తు—ఏడీ? ఈరాజు?

రాజు—అయ్యా! ఏమి యాజ్ఞ?

రుస్తు—రాజెవరు?

విదూ—అయ్యా! ఈదేశమునకు రాజు లేడు. నేను విదూషకుడను.

రుస్తు—రాజు లేకేమి? అసంభవము.

విదూ—అసంభవమో, సంభవమో, ఉండిన కనిపించడా?

రుస్తు—రాజెవరు?

విదూ—ఎవరు రాజు!

రుస్తు—ఓరీ, నాతోడ పరియాచకమా? రాజెవరో వేగమే చెప్పుము. లేకున్న—(కాలితో నేలతన్నును)

విదూ—(రాజుతో) అయ్యా! చెప్పనా? ఆలస్యము చేసిన కొంప మునుగునేమో?

రుస్తు—నీవా రాజవు?

రాజు—చిత్తము, నావల్ల నేరమేమి?

రుస్తు—నీ దేశమున నా గుఱ్ఱము నెవరో హరించిరి, నాకు దాని నీ వొసంగవలయు.

రాజు—కొంచెమవకాశ మిచ్చితిరా, మీ కప్పగించెదను.

రుస్తు—మంచిది, మూడునాళ్ళు గడు వొసంగితిని. అంతో—



రాజు—అంతవరకు మీరు—

రుస్తు—ఈ యూరనే ఉండెదను.

రాజు—అవశ్య మట్లు చేయుడనియే మాకోరిక.

సభ్యు—ధన్యులము. అదియే మా ప్రార్థనము.

రుస్తు—సరే విశ్రామాగార మెక్కడ?

విదూ—లోనికి దయచేయుడు, మీకు భోజనప్రయత్నములను గావింతుము.... (పోవుచు) అమ్మయ్యా! నేటి కొకగండము తప్పెను. శరీర మెట్లున్నదో స్వభావము నట్లే యున్నది. అతడు నేల తన్నినపుడు....బాబో! చూచి తీరవలయును; మా ప్రాణములన్నియు పిల్లిని చూచిన పంజరములోని పిట్టవలె పటపట కొట్టుకొనెను. హృదయమా! ఇక నూరడిల్లుము, ప్రాణమా! తల్లడిల్లకుము. ఇక భయము లేదు....అబ్బా! ఆత డిటనున్నప్పుడు ప్రళయ మాసన్నమైనట్లు—భూకంపము కల్గినట్లులును, మాధృతి పల్లటిల్లెను. అతడు వెడలినతోడనే ప్రాణములు కుదుట పడినవి. ఆత డుండునంత కాలము ఈయారాటము నూనదు—వానిగుఱ్ఱమును వాని కప్పగించితిమా ధన్యులము, లేకున్న మనుట సున్న.... (పోవుదురు.)



## నాల్గవ రంగము

(సమరఖండ రాజాంతఃపురము. తామినా, సఖులును.)

సఖి—చెలీ, మొగ మెత్తుము, నించిన కన్నీరు తుడువ నిమ్ము, నీచిత్తచోరు డిట నున్నాడు, అతని హృదయము మధుర నవనీతము-నీ బాహుపంజరమున వాని నిముడ్చుము. పెన్నిధి నీ ప్రాపుగనెను, నీ బాహుస్వర్ణమృణాలలతికల దాని నీ యక్కున జేర్చుము. నీ ప్రేమరసమును వర్షించి అనురాగబీజమును నాటితివా, నీ యాశాంకూరము క్షణక్షణ ప్రవర్ధమానమై అచిరకాలమున పుష్పించి ఫలోన్ముఖము కాగలదు.

తామి—సఖులారా, నేను మేల్కొని యున్నప్పుడు నాధ్యానమునకును, నిదురించు నపుడు నా స్వప్నములకును ఏకలక్ష్య మా దివ్యసుందరమూర్తియే. నిక్కము దాపనేల? అత డేనాడు యాదృచ్ఛికముగా మన నగరునకు వచ్చెనో, నాటినుండియు నా మన మాతని చరణకమలముల నాశ్రయించినది, ఎన్ని విధముల మరల్ప జూచినను మరలదాయె. ఏమిసేయుదు!

సఖి—ఇందు కచ్చెరు వొందనేల? శోకింప నేల? ఇది విధిప్రేరితము కావున అవశ్యంభావి.

తామి—నా మన మాతని కుపహారముగా నర్పించి తిని, నే నతని వరించితిని.



సఖి—చిత్రముగా నున్నది! నీ వాతని నెప్పుడు చూచితివి? ఎట్లు చూచితివి?

తామి—నేను చూడనేల? ఆతని యశము ఆసముద్ర విఖ్యాతము, అతని బాహుయుగళము ఇరానురాజ్యమునకు ప్రాపుగదా! వాని రూప మెట్లున్న నేమి? వాని యశఃకాయము అమరము, దివ్యసుందరము; నేను గుణముగ్ధురాల గాని రూపముగ్ధురాల గాను.

(సఖిపోవును—ఇంకొక సఖి వచ్చును.)

2 సఖి—చెలీ తామినా, చూచి వచ్చితిని.

తామి—అటులనా?

2 సఖి—నీ ప్రాణవల్లభు డెంత అందకాడే!

తామి—నీ వాతని నెట్లు కాంచితివి?

2 సఖి—అంతఃపురస్త్రీల కసాధ్య ముండునా?

తామి—ఆతని రూప మెట్లున్నది?

2 సఖి—అది చెప్పజాలను, కాని ఆత డెట్టివాడు కాడో చెప్పెదను.

తామి—అది తెలిసి యేమి ప్రయోజనము? ఎట్లున్నాడో చెప్పుము.

2 సఖి—సరిగా వర్ణింపగలనో, వర్ణింపలేనో అను సందియము కల్గుచున్నది-కావున నా తోచినంతవట్టు వర్ణించెద- అతని దేహము విశాలము, బాహువులు దీర్ఘములు, లలాట ముచ్చము, వక్షమున్నతము, వాణి మేఘగంభీరము, దేహ

యష్టి వృషస్కంధ తుల్యము-మూపులు గోపతిమూపురంబులు....ఒకసారి ఆతని చూచినచో ఆతని రూపము హృదయమున నచ్చుపడి యుండును, మరి పాయదు.

తామి—నాకై ఎంతశ్రమ నోర్చితివి! ఈ హారమును పారితోషికముగా గొనుము. (సఖి వచ్చును)

1 సఖి—సఖీ! ఏమి వింత!

తామి—అదెద్ది?

1 సఖి—రుస్తుముగుఱ్ఱము దొరికినదట.

తామి—అందు వింతయేమి?

1 సఖి—మనగుఱ్ఱము లన్నియు కట్టుత్రాళ్ళ తెంచుకొని పారిపోయినవి.

తామి—ఏల ?

1 సఖి—ఆ గుఱ్ఱమును చూచి బెదరుటచేత.

తామి—అదేమి ?

1 సఖి—దానిని చూడగనే మనగుఱ్ఱములకు సిగ్గు, బిడియము, త్రపయు పుట్టి అన్నియు సాలలలో నుండలేక పోయెను, ఒకటి మాత్రము_

తామి—ఏమి చేసెను?

1 సఖి—రుస్తుము గుఱ్ఱము దరికేగి వినయ నమ్రవదనయై మ్రొక్కి, మందస్మితముతో “ఏమి సులక్షణ సమన్విత మీ అశ్వ మ”ని మెచ్చుకొని దానియం దనురాగము గనుపరచెను. రుస్తుముగుఱ్ఱము కూడ మన గుఱ్ఱమునెడ అనురాగము



చూపి సకిలించుచు సగర్వముగా దాని నభినందించెను. రాజుగారు రుస్తుమును వాటి పరస్పరానురాగము నెఱింగి దాంపత్యము సమకూర్ప నిశ్చయించి శుభముహూర్తము నిర్ణయింప నున్నారట.

2 సఖి—జరుగబోవు దానికిది మంచి ఉపోద్ఘాతము.

తామి—ఏ మంటివి!

2 సఖి—రాబోవు ఘటనలు తమనీడల ముందుకు చాచునందురు. నీవు కూడ రుస్తుమును పెండ్లియాడ గలవు.

1 సఖి—రెండు కార్యములు ఒకసారియే కావచ్చును.

తామి—కాని_

2 సఖి—“కాని” కాదు, “కావున” అనుము.

1 సఖి—ఇక మనము తడయ నేల?

2 సఖి—రమ్ము నిన్ను పెండ్లికూతురిని చేయుదుము.

తామి—బాగు-బాగు.

సఖులు—కావుననే కార్యము నుపక్రమింతము. రమ్ము పోదము.



## ఐ ద వ ర ం గ ము

(రుస్తుము శయనాగారము)

రుస్తు—ఏమి విపరీత స్వప్నము! దూరమున వికట చీత్కారము-విశాల సముద్ర వక్షమున పోవుచున్న యోడ ఉత్తుంగ తరంగములపై ఊగులాడు చుండెను. ఏమి గాలి వాన, ఏమి యురుములు, ఏమి మెరుపులు, తుపాను, ఉప్పెన! భయావహములగు తరంగములు సముద్రతలమును ఫేనిత మొనర్చెను. తన్మత్త హాహాకారము దశదిశల మ్రోగుచుండెను. దానిమధ్య దివ్యగానము, ఒక క్షణమున నుచ్చమై, వెంటనే క్షీణమై, నశించి, తిరుగ, నుత్పన్న మగుచుండెను. పిమ్మట నొక దివ్యదీర్ఘనిశ్వాసమున సర్వము లీనమాయెను, పృథ్వ్యాకాశములు శుద్ధశాంతస్థిరభావము నొందినవి, ఘన శ్యామాకాశమున మేఘశకలములు పుంజీభూతములై కాన వచ్చుచున్నవి. సంగీతమంతయు శమించి తుదకు హాహాకార పరిణత మయ్యెను.

(తామినావచ్చును.)

ఎవరది?

తామి—నే నీ రాజుగారి దుహితను, నా పేరు తామినా.

రుస్తు—ఇట నాకు వినబడిన గానము—

తామి—వీరాగ్రేసరా



రుస్తు—ఇట్టి మోహనరూప మెన్నడును గాంచి యుండలేదు. ఏమి యీముఖచ్ఛవి! సర్వవర్ణరాజిని పదదళితము చేయుచున్నది. శుభ్రరక్తవర్ణము లీమె లావణ్యసమరభూమిని ప్రభుత్వమునకై పరస్పరము పోరు సల్పుచున్నవి. ఆహా! ఉత్తప్తనిదాఘమధ్యనిశీథమున శీతలమందసమీరోచ్ఛ్వాసము! నీలకడచెందిన క్రొమ్మబ్బుగా? నిష్కంప విద్యుద్దీపశిఖయా? ఆహా! కన్నులు ఘనీభూత రౌద్రదీప్తియుత ప్రభాతనీలిమ ననుకరించు చున్నవి. గ్రీవాభంగము కులీనతా సహజ వ్రీడను విడంబించు చున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసములు జన్మ మృత్యుగతుల విడంబించు చున్నవి....నీ వీరాజు కూతురవా? లేక దివ్యకాంతవా? నీపదక్షేపమున దివ్య ఝుంకార మెట్లుదయించె? దివ్యసౌరభము నీనుచున్న తనులత నీ కెట్లు సమకూరె? ఆహా! ఏమి నాయెడ నిట్టి నిర్వ్యాజ కటాక్షము! ఇది నిష్ఠుర మోస మగునా? ఇది కలయా? లేక నిక్కువమా?

తామి—మహాశయా! నీ వీరత్వగాథల విని మోహితనై నిన్నిదివరకే వరించి యుంటిని. నన్ను చేపట్టి నాజన్మకు సాఫల్యము చేకూర్పుమని వేడుకొన నేడు వచ్చితిని.

రుస్తు—ఏమి నీ యుదారభావము! ఏమి కలస్వనము! ఇది అసత్యమగునా? ఏమి సముజ్జ్వలదృష్టి! ఇట్టివ్యక్తియందు మిథ్యకు మోసమునకును నెలవుండదు.

తామి—వీరోత్తమా, నే ననూర్యంపశ్య నైనను

నిస్సంకోచముగా నీ దర్శనార్థ మిట వచ్చితిని. నీయందు పతి భావ ముదయించుట చేతనే ఇంత చనువుగొంటిని. పుణ్యపరిణయమున నన్నర్ధాంగిగా గొనుము. తండ్రిగారి సమ్మతి కావలయునా ?

రుస్తు—స్వప్నము సత్యమయ్యె.... కాంతామణీ, నీ జగన్మోహన రూపప్రభావమున మంత్రరుద్ధ భుజగంబనైతిని. నీమోహప్రభావమున నన్నవలీల మచ్చికజేసి వశపరచుకొంటివి. నేను వన్యపశువు వంటివాడ. ఇంతవరకును నా మనము సమర ఝంఝామారుతంబున వికంపితమై క్షుభితమై యుండె. అట్టిదానిని నీ యనురాగ లతికచే గట్టి క్షణమాత్రమున శాంతింప జేసితివి. నిన్ను గాంధర్వవివాహమున స్వీకరింప నున్నాడను, కాని నా దొకమనవి యున్నది. నేను శస్త్రోపజీవిని, కావున పరిణతప్రాయుడ నగువఱకు యుద్ధప్రవృత్తుడనై యుందును. సామంతరాజునగు నా కిది విధి. సమర వ్యాపారమున నేను వర్తించు నంతకాలము నీవు నాతోడ నుండజనదు. వివాహానంతరమున రెండునెలలు మాత్రము నీతోడ కాలము పుచ్చి ఆవెనుక ఇరానునకు బోవువాడ, సమరవ్యవసాయము సాంతమైన పిదప నీ దఱిడ జేరుదును. మద్వియోగము నీకు సమ్మతమగునేని నీ తండ్రి యనుమతిని నిన్ను పత్నిగా గొందును. చక్కగా నాలోచించి కర్తవ్యము నకు గడంగుము. చేయి కాలిన పిదప నాకు పట్టిన లాభ ముండదు.



తామి—మనోహరా ! లోకవృత్త మెరుంగనిదాన గాను, భవద్యశోభివృద్ధికి ప్రతికూలించుదాన గాను. త్రికరణశుద్ధిగా నిన్నే పతిగా వరించితిని ; నీ సమయము నాకు పరమాభిహితము.

రుస్తు—నీ తలిదండ్రుల నడిగి వివాహ ముహూర్తము నిర్ణయింపుము.

తామి—నా కనుజ్ఞ నిమ్ము.

రుస్తు—పోయిరమ్ము. ఇష్టార్థసిద్ధిరస్తు—






## రెండవ అంకము.

### మొదటి రంగము.

మహాకాలుడు—నేను మహాకాలుడ, అంధుడ, మత్తమహాసముద్రమువంటి వాడను. నా హృదయతలమున వత్సరములను కెరటములు పుట్టుచు గిట్టుచు నుండును. పృథ్వీదేవతవలె నా సంతానము నెటకో గొనిపోయెద, అటనే దాని పెంచి హింస్రజంతువులవలె నా కడుపున బెట్టుకొనెదను. జీవమను రక్తాక్తచక్రమును త్రిప్పుచు నేను పోవుచుందును. జీవుల సుఖదుఃఖములు తృణములవలె తచ్చక్రముచే దళితమగును....ఇరువది వత్సరము లీతీరున కడచినవి. అనాదియు నగాధము నగు అంధకారమున నవి అంతరించినవి. ఇరువది వేసవు లిట్లే చెల్లినవి. తామినా వ్యర్థానురాగము పరితప్తమయ్యె. రుస్తుము వారసీకమున రణోన్మత్తుడై ఉన్నాడు. అతని మనమున సమరఖండ రాజకన్య లోపించినది, కాని ఆమెసుతుడు సోరాబు సుకుమారుడు, ధీరుడు, నేత్రాంజన తుల్యుడు నగుట చిరదుఃఖాభిభూత యగు మాతను సజల దృష్టుల వీక్షించుచున్నాడు. ఇరువది ఆమనులు తమ సౌభా



గ్యసంభారముల నెల్ల నాతనిపై వర్షించినవి. వింశతి కుసుమిత సౌందర్యలహరు లాతనిపై ప్రవహించినవి. వింశతి వర్షర్తువు లవనీతలముపై వృష్టుల వర్షించినవి. నేటి కాతని కిరువది యేండ్లు నిండినవి. (పోవును.)



### రెండవ రంగము

సమరఖండ రాజాంతఃపురము—తామినా.

తామి—అంధకారసముద్రమున కెరటములు పుట్టి మెలమెల్లగా ముందుకువచ్చి జగమునందలి శుభ్ర జాతరూప ఛదల గ్రసించుచున్నవి, అనంతాలోకరాశి క్రమక్రమముగా క్షీణించుచున్నది. అభయదాయినియగు దివ్యసీలిమ ప్రతి యింటను శాంతి సుప్తి ప్రీతి సుధల వర్షించుచున్నది. సంధ్యాసేతువుపై నిలిచి దివము అంధకారవాహినిని వీక్షించుచున్నది. నేను నవనిరాశాంబుధిని మగ్ననై యున్నాను.

(సోరాబు వచ్చును.)

సోరా—అమ్మా! ఒంటరిగా నుంటివేల? ఏ మాలోచించుచున్నావు?

తామి—ఏమియు లేదు, నాయనా.

సోరా—అట్లనకు, నాతో నించుక చెప్పరాదా? నేడే కాదు, నీ వనుదినము నిట్లే విషాదమ్మున మున్గియుండి యెన్నో

గత దుఃఖము నభివృద్ధి చెందింప నేల? హేతువు నాతో చెప్పరాదా?

తామి—నీ వంటి సుతుడుండ నాకు దుఃఖమేల, నాయనా?

సోరా—ఏలొకో నీదృష్టి యెప్పుడును పశ్చిమాభిముఖమై యుండును. సంధ్యాసమయమున నెప్పుడు నిట్లే ఒంటరిగా కూర్చుండి యోచించు చుందువు. అగణ్య తారాగణమును తదేక ధ్యానమున చూచుచుండు నీకు రోమాంచమేల కల్గుచుండును? గభీర నిశీథమున నీ గదిలోనికి బోయి మేల్కాంచియే అప్పుడప్పుడు "సోరాబూ, సోరాబు" అని నిట్టూర్పు పుచ్చుచుందు వేల? నీ కన్నులు సంతతము బాష్పపూరితము లగుచుండును. ఊనుపోవుటకు నీ వెద్దియేని పాడుచుండు నపుడు నీ మనము పాటయందు లగ్నమగునట్లు తోపదు. ఇంత పరధ్యాన మేల? ఉన్నట్టు లుండి నన్నక్కున జేర్చి కన్నుల నీరు నించెద వేల? నా ముఖమును ముద్దులతో నింపి యించుకసే పేడ్చి వెంటనే నవ్వుచుందువు. దీని బట్టి చూడ నీ మానసము నెద్దియో గూఢవ్యథ అలమికొన్నట్లున్నది. అమ్మా! హేతువు చెప్పవేని దాని నే న[illegible] యింతును.

తామి—నాయనా....(నిట్టూర్పుపుచ్చును)

సోరా—అమ్మా! చెప్పుము. నీ నిగూఢవ్యథకు నిమిత్త మేమి?



తామి—నాయనా! నీ తండ్రి నెరుంగుదువా?

సోరా—ఆ విషయము నిన్నెన్నిసారులడిగినను నీవు చెప్పవైతివి, ఎవ్వరును చెప్పరు. నాకు తెలియు టెట్టులు?

తామి—అందనిపండునకు కఱ్ఱు దాచనేల అని చెప్పక దాచితిని. ఆ విషయము నీకు చెప్పవలదని నేను నిషేధించుటచే నెవ్వరును చెప్పరైరి. నీతండ్రి రుస్తుము.

సోరా—ఏమి! ఎవని కీర్తి దిగంతవ్యాప్తమో, ఎవని నామము భువనవిఖ్యాతమో, అట్టి పరాగ్రేసరుడగు రుస్తుము నాతండ్రియా? అమ్మా! నేను ధన్యుడ.

తామి—నాయనా, నిన్నాతడు చూడనే లేదు. ఇరువది వత్సరములైనను ఆతనికి మనపై కరుణ కల్గదాయె. నేడేమో ఆతని పుణ్యస్మృతి ధ్యానమున పరవశనౌటచే ఇంక దాచలేకపోతిని. భువనవిఖ్యాతుడగు ఆ శూరుడే నీజనకుడు.

సోరా—ఇంతవఱ కాతనిదర్శనము లభింపదాయె! ఎట్టి అదృష్టహీనుడ! దీనికి హేతువేమి? అమ్మా!

తామి—అతడు పోవునప్పుడు "మనకు సుతుడు కల్గెనా, వచ్చి కొనిపోయెద" నని చెప్పెను.

సోరా—ఇప్పటికిని రాకుండుటకు గతమేమి?

తామి—దానికి హేతుభూతురాల నేనే, భర్తృవియో
చించు దుర్భర మగుచుండ సుత వియోగమున దుఃఖ మినుమ జాలక "కూతురు కల్గెన" ని కబు రంపితిని. స్త్రీబుద్ధి ప్రళయాంతక మనుమాట నిజమయ్యె. లేకున్న నింకొకనారి యొసగాదు, నీ .

పాతని జూచుభాగ్యము నాకును, నిరంతర మాతనిపోషణమున నుండుభాగ్యము నీకు నబ్బియుండును. నే నంపినవార్త నిజమని నమ్మి ఆతడు వచ్చుట మానెను.

సోరా—అయ్యో! అమ్మా! మిథ్యావార్త నేల బంపితివి! అసత్య మెన్నటికైన శుభప్రద మగునా? కానిమ్ము, గతించిన దానికి వగవ పనిలేదు. నే నాతని నన్వేషించుచు పోయి పుత్రస్నేహశృంఖలముల బద్ధునిచేసి ఇట దెచ్చెదను, లేదేని ద్వంద్వయుద్ధమున నిర్జించి బందాగ్రాహినైన తెచ్చెద. నీవు చింతింపక యూరడిల్లుము.

తామి—వలదు, తండ్రీ, వలదు. నిన్ను విడిచి యొక క్షణమేని బ్రదుకజాలను. (జయారా వచ్చును) సోదరా, వీని వారింపుము.

జయా—ఏమి చేయనెంచె నక్కా?

తామి—ఎటకో పోవుదు ననుచున్నాడు.

జయా—ఎట పోవుదువు సోరాబూ?

సోరా—మామా, పారసీకమునకు పోయి నాతండ్రిని గాంచెదను. ఇందు విపరీత మేమి? తండ్రిని గాంచక యెన్నాళ్ళిట్లు వంత నొందుట? అమ్మ వియోగజ్వాల నార్పవలదా? తల్లికి ఘటించిన దుఃఖమును తొలగింపజాలని సుతు డుండిననేమి, మండిననేమి? నా జననీజనకుల సంధాన మొనగూర్చెదను.

తామి—తండ్రిపేరు చెప్పుమని ఈత డెన్నిసారులు నిర్బంధించినను చెప్పక దాచితిని. నేడు దాచలేక చెప్పితిని. ఏల చెప్పితినని ఇప్పుడు కుందుచుంటిని.

జయా—ఔను. తండ్రిని జూడక ఎంతకాలము తడయగలడు? ఈ కోర్కె సహజము.

సోరా—ఇంకొక మాట.... పారస్యాధిపతియగు కైకాయుశు తన రాజ్యమున స్వేచ్ఛాచారమును ప్రబల పరచెనట- ప్రపీడితులగు ప్రజల కరుణాక్రందనము దూరస్థమగు మన తురానురాజ్యమున గూడ వినవచ్చెను కావున వానిమదము సదమదము చేసెదను. నా జనకుడు నేనును కలిసితిమా మాకసాధ్యముండునా? అమ్మా! అనుమతి నిమ్ము.

తామి—అనుమతింపనా? నా జీవనాధారుడవగు నిన్ను వీడి నే నెట్లు ప్రాణముల భరింపగలను? తనయా!

జయా—అచిరకాలముననే వచ్చును. సోదరీ, ఎంతకాలము తల్లి ననుసరించి తారాడు చుండుట? వీరున కిది తగునా?

సోరా—అమ్మా, ఎంతో కాలము పట్టదు. సఫలీకృతమనస్కాముడనై శీఘ్రమే వచ్చి నీ చరణములకు వందన మొనర్తును. నన్నాటంక పెట్టకు.

తామి—సరే. పొమ్ము. నీ తండ్రిని గాంచుట నీకు విధి. నీకోరిక చేయగూడ దనగూడదు. మామను వెంట గొని పొమ్ము. ఆతడు భాసటై నిలుచును. నీ కద్దియేని ఆపద చేకూరిన నీ జనకునికి క[illegible] ఆతడు దానిని తప్పక



Acc. No.

వారించును. నాయనా, పయనము గమ్ము. పితృదత్తమగు కవచము నిచ్చెద, అది అభేద్యము నక్షయమని నీ తండ్రి చెప్పెను. (పోవును)

సోరా—అభేద్యమగు కవచమును నాతండ్రియిచ్చెనా?

తామి—(తిరుగవచ్చి) ఇదే కవచము. దీని నాతనికి జూపెదవేని అతడు నిన్నుతప్పక గుర్తించును. నీ విక పొమ్ము-నీకు సుఖమును యశమును చేకూరును గాక! పితృదర్శన ప్రాప్తి రస్తు.

సోరా—తల్లిని వీడి పోవుటకు మన సొప్పకున్నను నాకు పోవకతీఅదు.

జుయా—సోరాబూ!, పద, తాతగారియొద్ద సెలవు పుచ్చుకొందము.



## మూడవరంగము.

—:o:—

(సమరఖండ రాజసభ....రాజు, సభ్యులు, విదూషకుడు.)

రాజు—రుస్తుము చర్య అత్యద్భుతముగా నున్నది. నా కూతురిని పెండ్లియాడి యిరువదివత్సరము లైనది. ఆమె మాటయే తలపడు, తా నెటనున్నాడో తెలుపడు.

విదూ—పరారి యైనా డేమో!

రాజు—ఆతనిస్వభావ మతిచిత్రము, వేటకు బోయెనా, తిండిలేదు, నిద్రలేదు, శాంతిలేదు. తినుటకు కూర్చుండెనా



అదేపని. నిద్రబోయినచో అహోరాత్రము లేకనిద్రయే. ఏపని నుపక్రమించిన అదే లక్ష్యముకాని వేఱొండు తలపడు.

విదూ—ఈ దేశ మాతనికి సుఖదాయకమ్ము కాదు కాబోలు.

రాజు—యుద్ధమునకు గడంగినచో సంతతము యుద్ధమే. సురాసముద్రమున మున్గియుంటచే ఈ జగమును మరచెనేమో?

విదూ—ఎంచి యెంచి మంచి అల్లుని సంపాదించితిరి! అతని చూచినప్పుడనే గుండెలో దడ పుట్టును. ఏమి భీకర మూర్తి!

రాజు—వీరాగ్రేసరు డెట్లుండును?

విదూ—చూచుటకు ఇంపుగా నుండగూడదా వీరుడు? ఏమి చలచిత్తము! పెండ్లియాడి పెండ్లామునే తలపడు?

రాజు—కైకాయుశు వాని నెటకేని పంపి, తాను సింహాసనముపై....

విదూ—నిశ్చింతుడై యున్నాడు.

రాజు—నా కూతురిని వివాహమాడి ఆమె యూసైన తలపెట్టుట మానెను. ఇందుకు హేతు వేమైయుండును?

విదూ—అట్టివాడు తొలుత వివాహమాడుటయే తెలివితేమి కాదా?

రాజు—ఏల?

విదూ—పెండ్లియాడిన క్రొత్తరికము రెండేండ్లవరకు శృంగారస్వప్నములతో కాలము కడచును. పిమ్మట దంపతుల యవస్థ "ఇతో భ్రష్టః తతో భ్రష్టః" అగును. అది సహించుట కష్టము.

రాజు—ఎట్లు ?

విదూ—అది కేవలము దాసత్వము. భేద మేమన—యజమానుని యెడ దాసుడై వర్తించినవానికి రెండుకాసుల కూలి దొరకును. స్త్రీలకు దాసత్వ మొనర్చువాడు సర్వము వారికే అర్పింపవలయు- దీనికితోడు అప్పుపైని వడ్డీవలెసంతానము హెచ్చెనా "గోరుచుట్టుపై రోకలిపోటు" అన్నట్లగును.

రాజు—నీ గార్హస్థ్యము విశేష సుఖదము కానట్లున్నది.

విదూ—సుఖదమో దుఃఖదమో నిర్ణయింప జాలను.

రాజు—అట్లైనచో నీ జీవనము నిర్భరమే.

విదూ—హేయమని చెప్ప నగును.

(జయారా సోరాబులు వత్తురు.)

రాజు—నాయనా, సోరాబూ, ఈ వేష మేల ?

సోరా—తాతగారూ, మీ సెలవుగైకొనుటకువచ్చితిని.

రాజు—సెలవా ? ఎటకేని పోవ నెంచితివా?

సోరా—ఇరాను దేశమునకు పోయెదను.

రాజు—ఏల ?

సోరా—నా తండ్రి నిట కొని వచ్చుటకు.



జయా—రుస్తు మటనున్నాడని యెరిగి ప్రయాణ మగుచున్నాడు.

రాజు—ఆత డుండుచోటు నిశ్చిత మాయెనా ?

సోరా—నేను వెదకి కనుగొందును. మొదట ఆరాజు గర్వ నిర్వాపణ మొనర్చెద. ఆ దురాచారుడు రాజుగా నుండ గూడునా ?

రాజు—ఆ తండ్రికి తగిన కొడుకు ! పారసీక రాజు సామాన్యుడని యెంచితివో? వాని రాజ్యమేమి! వానిబల మేమి!

సోరా—వానిబల మెంతయుండినను నాకు భీతి లేదు, నా తండ్రియు నేను నేకమైనచో వాని స్వేచ్ఛాచార మడుగం టదా ! అత్యాచార మణంచుటకే కదా భగవంతుడు వీరులకు బాహుబలమును ప్రసాదించెను. లేకున్న దాని ప్రయోజన మేమి ?

విదూ—భగవంతు డొనర్చిన దానికి హేతువు ఆతడే యెరుగును. మనమేల యడిగెదవు ?

సోరా—ఐశ్వర్య మదాంధతచే అత్యాచారము ప్రబలు నప్పుడు దాని నణచుటయే వీరులకు విధి.

విదూ—ఔను. దండం దశగుణం భవేత

రాజు—అట్లయిన పోయిరమ్ము. నాయనా జయారా, నీవుకూడ వీనివెంట బొమ్ము-సోరాబు బొత్తిగా బాలుడు. కొంతసేనను గొనిపొండు, మీకు రుస్తుముదర్శన మగుగాక!

విదూ—తథాస్తు.

జయా—పండ్రెండు వేల సేనను వెంట కొనిపోవుడని మన సేనాధిపతి అఫ్రిసియాబు చెప్పెను.

రాజు—సరే-అశ్వశాలకు పోయి సర్వోత్కృష్టమగు అశ్వమును నెంచుకొని పొండు.

జయా—రుస్తుము అశ్వమునకు జనించినదే ఉత్కృష్ట తేజస్వి.

రాజు—దానినే కొనిపొండు.

విదూ—బాగు బాగు. రుస్తుము కుమారుడు వాని అశ్వమునకు బుట్టిన అశ్వముపై స్వారిచేయుట యుక్తమే.

సోరా—తాతగారూ, మాకు సెలవిండు.

రాజు—పోయిరండు. (వారు వెళ్ళుదురు.) సోరాబు వీరోత్తముడు కావున ఇందు భయకారణ ముండునా?

విదూ—మహారాజా, యుద్ధరంగమున నిరుగడల వారును ఒకరిమొగ మొకరు చూడక-ఒకరు తూర్పునకు, ఇంకొకరు పడమరకును మొగములు త్రిప్పి యుద్ధమునకు గడంగిరేని భయము లేశమైన నుండబోదు.

రాజు—అటులనా?

విదూ—మొగములు తాగసిల్లిన భయ ముండవచ్చును.

రాజు—ఉండునేమి?

విదూ—యుద్ధములయందు రెండువీడుల వారును పరాఙ్ముఖులు గాక పరస్పరాభిముఖు లగుట అధర్మము. ఏల



యన జ్ఞానేంద్రియములు ముఖమందున్నవి, వీరులు పరస్పరాభిముఖులైనచో వాటి కపాయము కలుగవచ్చును.

రాజు—నిజము-నిజము.

విదూ—ఇంకొకటి-ఇరువీడుల వారును పరస్పరవిముఖులైనచో ఏ యల్లరియు నుండదు, యుద్ధము నిర్వివాదమగును.

రాజు—మన దేశమున యుద్ధము లిట్లే జరుగునుగాక. ఏమి నీ బుద్ధికుశలత!

విదూ—నాలుక యుండిన తలను కాచును, బుద్ధి యుండుటచేతనే భోజనము లభించుచున్నది.

## వాల్గవ రంగము.

(ఇరాను ప్రాంత దుర్గము-హుజీరు, ఆఫ్రిదు.)

హుజీ—పండ్రెండు వేల తురుష్కాశ్వికులతో సుసజ్జితుడై సోరాబు మన దుర్గమునకు వచ్చెను.

ఆఫ్రి—ఏ యుద్దేశముతో?

హుజీ—దీని జయించుటకు.

ఆఫ్రి—ఇక నాలస్య మేల? యుద్ధమునకు సిద్ధులుగండు.

హుజీ—అదే ఆలోచించు చుంటిని.

ఆఫ్రి—యుద్ధము సేయకయే దుర్గము అప్పగింతురా?

హూజీ—అట్లైన్న దేని జరుగునా?

ఆఫ్రి—సకేంచర్మ వర్మ శిరస్త్రాణముల ధరించి కత్తులను భల్లెములను విల్లమ్ములను గొనుడు.

హూజీ—యుద్ధమునకు గడంగువారలు సన్నద్ధు లగుదురు.

ఆఫ్రి—నీవు సేనాధిపతివా?

హూజీ—ఆ పదమును స్వీకరింప దలచినవారున్న నే నిప్పుడే విడుచున్నాను.

ఆఫ్రి—దేశమునకై నీవు ప్రాణ మర్పింపవా?

హూజీ—ప్రాణము లెంతలేవి! వాటిని తుచ్ఛములని యెంచగూడునా? (గుస్తాహాము వచ్చును)

గుస్తా—సోరాబు మనదుర్గము అవరోధించెను, కర్తవ్యమేమి?

హూజీ—అయ్యా, మన మీ అల్పసైన్యముతో సోరాబును తలపడుట యుక్తిసంగతము కాదు.

గుస్తా—యుద్ధ మనర్థదాయకమనియా మీయూహ?

ఆఫ్రి—తండ్రీ, ఇరువదేండ్ల బాలునకు వీపులు వెరచిన లోకము నవ్వదా?

గుస్తా—నిజమే—సేనాధిపా-మనల నందరు గేలిసేయుదురు.

హూజీ—చేయనిండు, ప్రాణములు దక్కుట శ్రేయము కాదా?



గుస్తా—అమ్మా! హూజీరుమాట సమంజసముగా నున్నది. లోకులు నవ్విన నష్టమేమి? ప్రాణముల బాయుట కష్టము కాదా?

ఆఫ్రి—మానముద్రోసి ప్రాణముల గావనగునా!

గుస్తా—అవును. అదియు నిజమే. మానముకన్న ప్రాణ మెక్కువయా? హూజీరూ!

హూజీ—ప్రాణము పోయిన మానముదక్కుట దేనికి?

గుస్తా—మానముదక్కించుకొనున దుండదు, నిజమే.

ఆఫ్రి—ఇరువదేండ్ల బాలుడు! వాని యెదుట-

గుస్తా—పరాజయ స్వీకారమా? మీరు చెప్పుదానిలో ఏది శ్రేష్టతరమో నిర్ణయింప లేకున్నాను.

ఆఫ్రి—యుద్ధమే యోగ్యతరము.

గుస్తా—అట్లే సేయుదము.

హూజీ—యుద్ధము చేయుట లాభదాయకము కాదు.

గుస్తా—అట్లైన యుద్ధము వలదు.

ఆఫ్రి—తండ్రీ, ఇంత చాపల్యము వీరునకు కూడునా?

గుస్తా—నాబుది కేది యుక్తమో తెలియదాయె. నేను యుద్ధముచేయుట నెరుంగుదును. కాని ఎప్పుడు యుద్ధము సేయుట ఉచితమో, ఎప్పు డనుచితమో మాతండ్రిగారు నాకు బోధింపలేదు. ఆ విషయము మీలోమీరు చర్చించి ఫలితము నా కెరిగింపుడు. (పోవును)

ఆఫ్రి—అదియు నంతము నొకతీరుననే వెల్లుచున్నవి. అందఱు వీరికిముందు తిన్నారు. ముందున కొక యడుగైన వెట్టజాలరు. మీ రీపసిబాలున కోడిన మిమ్ము కాపురుషు లని యెంతును.

హుజీ—అట్లనబోకుము.

ఆఫ్రి—నీ మొగ మింకచూడను.

హుజీ—ఈవిషయమున ఒక చిక్కున్నది. అందుకు కారణ మేమన—

ఆఫ్రి—నీవు చెప్పునది నే నెరుగుదును. నాకు కోపము వచ్చిన నీ కేమికొరత ?

హుజీ—అమ్మయ్యో! నీకు కోపము రానిత్తునా? అట్లైన యుద్ధము సేయుదును.

ఆఫ్రి—చేయగలవా?

హుజీ—నీవు నాయెడ సుముఖివైన నట్లే చేయుదును.

ఆఫ్రి—(నవ్వుచు) మంచిది. సమరసన్నాహము చేయుము. (పోవుదురు)





## ఐదవరంగము.

(యుద్ధభూమి-హుమాన్, వర్మాన్)

వర్మా—మనల నీసైన్యముతో ఆఫ్రిసియాబు ఎందుకు పంపెనో జ్ఞప్తి యున్నదా?

హుమా—దాని మరతునా? వీరవరుడగు రుస్తుము పారసీకరాజునకు బాసటై నిలిచెనేని, ఆఫ్రిసియాబునకు ఆదేశము వశమగుట అసంభవము.

వర్మా—సోరాబు రుస్తుమును తలపడెనేని సాధారణ యుద్ధము అగునని తలపఁ గూడదు. నిన్నటి యుద్ధమున సోరాబెంత అనాయాసముగా హుజీరు నోడించి బందీకృతుని జేసెనో కంటివా?

హుమా—అబ్బ! సోరాబు అసహాయశూరుడు. దైవవశమున సోరాబు రుస్తుము లొకరినొకరు పరిచయము కావించుకొనిరా, వారికి పోరు పొసగదు.

వర్మా—అట్లెన్నడును సంభవింపదు; మన ముందుకే వచ్చితిమి. వారి సంబంధ మింకెవ్వరు నెఱుంగరు. మనకిద్దరకు హుజీరునకు మాత్రమే అది తెలియును. శిబిరమునకు పోవుదము రమ్ము.

హుమా—సరే........(పోవుదురు)

(సోరాబు వచ్చును.)

సోరా—సమరరంగమా! శూన్యమైతివి! మాయమ్మ నన్ను వీడ్కొల్పునప్పుడు నాపై సారించిన కరుణా

ర్గ్రిదృష్టిపాతము ఇప్పుడు స్మరణకు వచ్చుచున్నది. అమ్మా! నా కార్యము నిర్వహించి వెంటనే నీదర్శనము చేసెదను.

(వీరవేషమున ఆఫ్రిదు వచ్చును.)

నీ వెవడవు ?

ఆఫ్రి—వీరవరుడ వగు సోరాబవు నీవేనా ?

సోరా—ఔను.

ఆఫ్రి—నాతో యుద్ధము సేయ రమ్ము

సోరా—నీ తోడనా ? బాలకా !

ఆఫ్రి—ఔను, నాతోడనే.

సోరా—హాస్యమున కనుచుంటివా ?

ఆఫ్రి—హాస్యము కాదు—రమ్ము పోరికి.

సోరా—నీ తోడ యుద్ధమా ? నా చేత కాదు. సం నీతమృదులమగు నీతనువుపై నస్త్రఘాతము సేయజాలువా రుందురా ? నీ ముఖము ముద్దున కోర్చునుకాని ముల్కు కోర్వదు.

ఆఫ్రి—పరియాచకము మాని పోరునకు ఆయత్తుడవు గమ్ము.

సోరా—బాలకా! నీవుపసివాడవు-సాహసముమాను.

(ఆఫ్రిద్ కత్తితో నరుకబోవ సోరా బాహ్రేసు తప్పించి)

నీపై కత్తి వేయను, నీయుష్ణీషమును తొలగించెదను; కత్తుత వైనచో కాచుకొనుము. (యుద్ధము సేయ నది క్రింద



పడును ) ఓహో ! నీవు బాలికవా ? కోమలీ ! ఎవ్వరి దానవు? ఎవ్వతెవు? (చేయి పట్టుకొనును.)

ఆఫ్రి—నే నీదుర్గాధిపతి కూతురను-నాపే రాఫ్రిదు.

సోరా—మొదట నే ననలేదా ? నీ ముఖము ముద్దు బెట్టుకొన దగిన దని.

ఆఫ్రీ—నా చేయి వదలుము.

సోరా—పట్టుకొనిన నేమి ? నీవు నా కైదివి కావున ఇది యుక్తమే-నీవు విడువుమన్న వీడుదునా ? అది యేటి ధర్మము ? నిన్ను చూచినప్పటి నుండియు చంద్రనిభమగు నీమోము పురుషున కుండదని నేను భావించు చుంటిని.

ఆఫ్రి—జనులు నిన్ను చుల్కన చేయుదురు.

సోరా—చేయ నిమ్ము-విరసమగు ప్రస్తావము నేను చేయు లేదె ? నీ కిష్టమున్న నిన్ను చేపట్టెదను.

ఆఫ్రి—ఒకమాట చెప్పవలసియున్నది. నిన్ను వివాహ మాడుట నా యభీష్టమే, కాని నా తండ్రి యనుమతిని నే పొందవలయు, నేడు సెలవిమ్ము-రేపు నాజనకునితో దుర్గ మర్పణ చేయు మనెద, పిమ్మట మన వివాహము జరుగును. నా తండ్రి వృద్ధుడు, నే నాతని కేకసంతానమగు తనయను.

సోరా—మంచిది, పోయిరమ్ము, నీ వాడిన మాటల మరువ వలదు. వీరబాలా ! నా బలము నిన్ను నా కైదిగా నొనర్చినట్లు నీ రూపము నన్ను నీకైదిగా నొనర్చెను. నీకు శుభ మగుగాక ! పోయి రమ్ము.

ఆఫ్రి—త్వరలో వచ్చెద, నన్ను మరువకు—(పోవుదురు)

(హుజీరును కైదుజేసి యిద్దరు భటులు గొనివత్తురు)

హుజీ—ఆఫ్రిద్, నీ మన స్సింత దుర్బలమా! నీ వలవు చేష్టల జూచితి, మాటల వింటిని-దీనికి ప్రతిఫలమచిర కాలముననే పొందెదవు లే.

భటులు—నడువుము చెరలోనికి.

హుజీ—నడువుడు—(పోవుదురు)

(సోరాబు, హుమాన్, వర్మాన్, వత్తురు)

సోరా—హుమాన్, దుర్గాధిపతి యుద్ధము చేయక కోటను విడువ డనుట నిజమేనా?

హుమా—అట్లే వింటిని.

వర్మా—ఇప్పుడే దూత వచ్చెను.

సోరా—లోన ప్రవేశపెట్టుము. (ఆఫ్రిను వచ్చును)

ఆఫ్రి—వీరవరా! నా తండ్రి యుద్ధము చేయక దుర్గము నర్పణము చేయడు, కావున రణమొనర్చి దుర్గమును సాధించుకొనుము.

సోరా—నీవు చెప్పిన దంతయు మోసమా! సుందరి!

ఆఫ్రి—మోసమా? నీవు బాలుడవు కావున నారీజన్మతత్వ మెరుగవు, మోహనరూప మాపాదమస్తకము మోస పూరితము-పురుషు లీవిషయము నెరుంగరు కావున కామినుల నలంకారముల తోడను, సౌరభముల తోడను నింపిచూచి యానందింతురు. స్త్రీచిత్త మెఱుంగ నిర్బోధులగు



పురుషులకు శక్యమా? ఈ ప్రపంచమే మాయ-అన్నిటి కంటెను మాయావిని యగు వ్యక్తి మత్తకాశిని, తెలిసినదా?

సోరా—యుద్ధము సేయక కోటను వీడరా?

ఆఫ్రి—విడువము. యుద్ధమేల? ఇంటికి పోయి సుఖివై యుండుము. శక్తిమదభరమున నితరులసొత్తును గ్రహింప కోరక విరమించుట సర్వశ్రేయము, ఉభయ తారకము-నా మాట విను. (పోవును)

సోరా—మంచిది-నేడు సూర్యుడస్తమించుసరికి భూమి యంతయు రక్తముచే సిక్తమగును............సేనాధిపులారా! దుర్గప్రాకారముల భగ్నము చేయ సేనల కాజ్ఞాపించుడు. దుర్గశిఖరమును చూర్ణము సేయుడు.

హుమా—అట్లే చేయుదుము.

సోరా—దుర్గమును ధూళిసేయుడు.

వర్మా—చిత్తము............(పోవుదురు.)

(హుజీరును కైదిగా పట్టి తెత్తురు)

హుజీ—ప్రాకారముల బ్రద్దలుసేయుడని సేన కాజ్ఞ నొసగితిరా?

సోరా—ఇచ్చితిని.

హుజీ—సైన్యాపచయము సంభవించునే?

సోరా—కానిమ్ము-సేనకు కొదవలేదు.

హాంజీ—దుర్గము నాక్రమించుటకు సులభమగు సదుపాయము కలదు.

సోరా— ఏది?

హాంజీ—ఇందు ఛిద్రమగుచో టొకటి కలదు, అది అరక్షితము, ద్దాని భేదింప నుపక్రమించినచో జయము సులభము. తత్సంధానము నేను వివరించెదను.

సోరా—నా వెంటవచ్చి ఆచోటు చూపుము.



## ఆ ర వ ర ం గ ము

(దుర్గాభ్యంతరము—ఆఫ్రిదు సైనికులు)

ఆఫ్రి—సైనికులారా, యుద్ధ మారంభ మైనది. నా తండ్రిగారు స్వయముగా దుర్గప్రాకారక్షులై యుద్ధ పర్యవేక్షణము సల్పుచున్నారు. మీ రీదుర్గమును కాపాడుడు.

సైని—ప్రాణములనైన వీడుదుము. కాని దుర్గము నర్పింపము.

ఆఫ్రి—యుక్తమగు నుత్తర మిచ్చితిరి. పోరు సల్పుడు పొండు.....(వెళ్ళుదురు)....సోరాబూ ! నీవీర్య మత్యద్భుతము, శౌర్య మద్వితీయము-వాటిని చూచిన నాకు నీ యందమితమోహ ముదయించు చున్నది. నా చిత్తము నీయధీనమున జొత్తిల్లి యున్నది, నీ దృష్టి యెంత మధురము-నీ భంగి



ఎంత కమనీయము! ఏమి నీ గుండెనిబ్బరము! ఎట్టి ఆత్మనిర్భరము! ఏమిదయ, ఏమిఔదార్యము! సోరాబూ! సోరాబూ!.... కాదు కాదు-నీవు నాశత్రుకోటిలోని వాడవు, కావున నీవైపు ప్రవహించుచున్న నా అనురాగ పరీవాహము నరికట్టెదను. నీ ప్రేమప్రస్రవణము నవరోధింతును-నీతో పోరెద, జయము గాంచెద-లోహార్గళమున నిన్ను బంధింతును.

(సైనికుడు వచ్చును.)

సైని—అమ్మా ! సర్వనాశ మాయెను.

ఆఫ్రి—ఏమి?

సైని—దుర్గాధిపతి సోరాబుశరవిద్ధుడై ప్రాకారాంచలము నుండి దిగువ బడియెను.

ఆఫ్రి—ఏమీ? నా తండ్రి మరణించెనా ? హా, హతవిధీ! ఈ బాలుడు నా తండ్రిపాలిటికి కాలు డయ్యెనా?

సైని—అతని రక్షించు నాశ లేదు.

(ఇంకొక సైనికుడు వచ్చును)

2 సైని—అమ్మా! ఇక దుర్గరక్షణ మసంభవము.

ఆఫ్రి—ఏ మైనది?

2 సైని—శత్రువులు దుర్గములోనికి జొచ్చిరి.

ఆఫ్రి—ఎట్లు?

2 సైని—జీర్ణస్థానమునుండి!

ఆఫ్రి—అది వారి కెట్లు తెలిసె?

2 సైని—హాంజీరు గుట్టును రట్టుచేసి యుండును.

1 సైని—సైనికులారా, వెన్నిచ్చి పారుట వెక్కలితనము జీవము లుండునంతవరకును పోరి మడియుట శ్రేయము.

అఫ్రి—నీపూనిక ప్రశంసనీయమే, కాని ప్రకృతమున అది అసంభావ్యము, గుప్తద్వారమునుండి వెడలుదము—పట్టువడవలదు, మృతిని చేపట్టవలదు—ప్రాణములుండిన పగ దీర్ప వచ్చును—నిశీథనిబిడాంధకారమున నిర్గమింతము. (పోవుదురు.)

(సోరాబు ససైన్యుడై ప్రవేశించి)

సోరా—దుర్గము శత్రుశూన్యమయ్యె.

వర్మా—హతశేషులగు వీరులు గుప్తద్వారమున బైట పోయిరి.

సోరా—దానికి నేను చింతింపను—దుర్గము కరగతమయ్యె, కాని ఆ వీరబాల పలాయితురాలయ్యె—పిట్టలేని పంజరమువలన ప్రయోజన మేమి? మన దేశమునకు పయనమగుదము.

వర్మా—శూరోత్తమా, మహావిజయ నిర్మేఘప్రభాతమున మరలి పోవచ్చునా? నీ మహిమారశ్మి దుర్గశిఖరమున ప్రసరించెను. దాని వీడి వెడలుట అవినీతి కాదా?

హుమా—వీరవరా, ఇవేటి మాటలు! మహాసంగ్రామ సముద్రమును తరించి మగుడబోవ నెంతురా? శత్రువులు నవ్వరా! ఒక వీరబాలకు వెరచి వీరుడు వెనుకంజవేసెనని వెక్కిరింపరా? భయమున బాలుడు పలాయితుడాయెనని భావింపరా!



వర్మా—పారిపోవుట పరువుకాదు; వెనుకంజవేయుట వెంగలితనము.

సోరా—నిజమే కాని, ఆ మోహిని నన్నిట్లు మోసగించెను. ఎంత వారించినను పంతము వీడదాయె.

హుమా—యుద్ధమాపి అమె నారయుదము—వంటయింటికుందే లెందు పోగలదు.

వర్మా—ఇందు లేదు. పారసీకరాజు నాశ్రయించుటకు పరుగెత్తియుండును. అతనిపైకి మనము దాడివెడలినచో ఆ రాజును ఈ వనితయు మనకు వశమగుదురు. భేరీరవములు చెలంగ ప్రయాణము సాగింతము—ఆ రవము పారసీకులగుండెల బ్రద్దలుసేయు గాక.

సోరా—మంచిది—ఇక నాలసింపకుడు.

---

## ఏడవ రంగము.

అరణ్యమున అఫ్రిదు.

అఫ్రి—ఈ యరణ్య మెంతగభీరము!—నిర్జనము, నిస్తబ్ధము—అటనట నుండు సలిలప్రపాతముల ధ్వనిని భేదించుకొని సింహగర్జనములు, బెబ్బులుల బొబ్బలు, చెవులను బ్రద్దలు జేయుచున్నవి. ఘనపల్లవితతరుషండము దీర్ఘశాఖాబాహువులతో పరస్పరాలింగన మొనర్చుచు కాలిబాటల నిబిడనీరంధ్రమున నాచ్ఛాదించుచున్నది. భయావహమగు నిచ్చోట

నాబోటి అబల సంచరింప సాహసించుట విస్మయజనకము కాదా? నీడకైన తోడు లేదాయె. ఎల్లెడ చరించు వన్యమృగ మెద్దియైన నోట కరచుకొని పోవునేమో? కొండదరియల దూరుచున్న అజగర మేదియైన మ్రింగునేమో? ఒంటరిగా నిట్లేల వచ్చితిని? తండ్రియా దేహము చాలించె, కోట శత్రువుల పాలాయె. అది నాకు శైశవమున డోల, యా వనమున స్నేహకుంజము.........నా స్వజన మేది? నే నేడ? నా సైన్యమున హతశేషులు ఏవురును శ్రాంతులౌట శయనించిరి. చింతాశూన్యులగు నాసఖులు నదీతటమున నర్మసల్లాపముల నానందించుచున్నారు. అదేమి సుఖమో నేను భావింప లేకున్నాను.........ఆశ్చర్యము! ఇట్టి దుఃఖపరంపర నన్నలమినను ఎట్టి విధిబలమున దీనినంతయు సహింప కల్గితినో ఊహింప జాలకున్నాను........ఈ దుఃఖ మెట్లంతరించును? పితృవధ నా హృదయమునకు శూలాయమానముగ నున్నది. ఆ బాధ క్షణక్షణప్రవర్ధమాన మగుచున్నదే కాని, కాలక్రమమున నశించుట లేదు. బ్రతికి యుండునన్నాళ్ళు నన్నిది బాయదు. ప్రతిహింసను అబింధనమువలె అదిమియుంచితి, అది మనోబలమును మాడ్చునేమో ?....

ఆ వీరుని ముఖబింబము సౌరు నా కన్నుల గట్టినట్లున్నది. అదియు బాయదయ్యె! కమనీయమగు నాతనిముఖము, స్నేహార్ద్రములగు నాతని వీక్షణములు, నా మానసము నరికట్టినవి. అతడు నా తలపునకు రానిక్షణము లేదు-సంతత



బాష్పవృత్తి సంక్రమించినది- సదమదము చేయ సాధ్యము కాకయున్నది- అతడు నాకు లభించుట అసంభవమని యోచించి ఆతని యెడకు పోవలదని నామానసము నెంత వారించినను అది తన కేకలక్ష్యమగు నాతనియందే లగ్నమగు చున్నది.... కాని అతడు నాపాలికి అగాధసముద్రమందలి మణియు ఆకాశమందలి చంద్రునివలె నున్నాడు. మాయిద్దరకు నడుమ దుస్తరమగు సముద్రము, దుర్గమమగు పర్వతశ్రేణియు నున్నవి. వాని దాటు టెట్లు? ఆతని చేరు టెట్లు? ఈ వ్యామోహము నాపు టెట్లు? దుర్భరమగు చున్నదే ?——ఈ మహావసాదము మాను టెట్లు ?

ఒకదెస పితృహత్యకు ప్రతీకారము సేయుట_ఇంకొక దెస మనోవాక్కాయకర్మల వరునిగా నెంచుకొనుట!........ఈ విషమ చిత్తవృత్తులను ఏకలక్ష్య మొనర్చు టెట్లు?........ ఆతని ప్రేమింపనా? లేక ఏవగింపనా? ఇది విలక్షణమగు సంధి — ప్రతీకారవాంఛ యెక్కుడో ప్రణయప్రీతి యెక్కుడో నిర్ణయింపజాలను....పరస్పరకలహమున నేదియు నీడుతీయ కున్నది....ఆతనిప్రాణము తీయకున్న ప్రతిహింసాపూర్తి కాజాలదు....నా ప్రాణమర్పింపకున్న ప్రణయపూర్తి కాజాలదు. వీని సమానాధికరణ మొనర్చు టెట్టులు ?.... ఇక హుజీరు—ఆ విశ్వాసఘాతకుని స్వహస్తమున ఖండింపకున్న - నా పరితాప మారదు....అంతతో నా మనోవ్యాధి అంతరించిన బాగుగ నుండును.

వీరశేఖరా! సోరాబూ! నీవు నాకు శత్రుడవు కాకున్న నీ చరణకమలములకు నాప్రాణములను అనాయాసముగా నర్పింపనా? నా దుర్విపాకమున నీవు నాదేశమునకు శత్రుడవౌట నాకు పరమశత్రుడవైతివి. నీవు నాకెంత ప్రియుడవైనను నీ శిరమును ఛేదించి నీ రక్తమును నా దేశమునకు ధారవోయక తీరదు_నీవు నా దేశమునకు హితుడవైనచో నీ కనుసన్న గనినంత మాత్రమున నీవు నాకెంతశత్రుడవైనను, విజాతీయుడవైనను, విరూపుడవైనను—నిన్నాశ్లేషించు భాగ్యము నా కబ్బియుండును కదా!....సోరాబూ! నవనీత కోమలమగు నా తనువున శస్త్రపాతము చేయ నీవు జంకితివి, కాని నాకు నీయెడ నట్లాచరించుట తప్పదు. నీవు నా దృష్టికి వన్యమృగమవైతివి, కావున వేటకానివలె నిన్ను వెంటాడించుచుంటిని....నీవును హుజీరును మా తపోవన హ్రదమున చేరిన కుంభీరయుగను—మా హంసతూలికా తల్పము నాశ్రయించి యుండు కాలసర్పయుగళము—మికెమ్మకత్షణమైన మరువజాల—కన్ను మొరగినా కాటు వేయుదురు, అట్టి మీా యెడ ప్రేమ పుట్టుటెట్లు?

ఆఁ?....అట్లుకాదు—అతడు ద్రోహి, నీవు హితైషివి, అతడు విశ్వాసఘాతుకుడు, నీవు మాకు పరమాప్తుడవు; అతనియెడ అసూయ సహజము, నీ యెడ భక్తి సహజము. పాలుపోసి పెంచినపామువలె ఆ పాపుడు మా వంశమును ద్వేషవహ్నిచే క్షీణింపజేసెను....నీవమృతకరుడవు. మమ్ముద్ధరింప



సమకట్టి యుద్ధము వలదని బోధించితివి, కాని పైత్యరోగికి పంచదారవలె నీ హితము నాకు రుచింపదయ్యె—"వినాశకాలే విపరీత బుద్ధిః"

నీ వెంత హితైషివైనను మా మర్మముల గ్రహించుటకు మామందలోనివాని చేరదీసితివి-అది ధర్మమే-దుష్టుని చేరదీసి మాకు కష్టముల చేకూర్చితివి....నీ యందు నాకు గౌరవము, భక్తి, ప్రేమయు లేకపోలేదు....కాని నాతండ్రి ప్రాణములను తీసినవాడవగుట నాకు పరమశాత్రవుడవైతివి, పితృవధకు ప్రతీకారమొనర్ప శపథము చేసితిని. అట్లు చేసి తీరెదను....ముమ్మాటికి నిజము....భైరవప్రతిహింసాగ్ని రగిలి నిన్ను భస్మముచేయ ప్రేరేపించుచున్నది....ఈనిన పులివలె నిన్ను కబళింతును. (పోవును)






## మూడవ అంకము



### మొదటి రంగము.

(పారసీకరాజసభ-రాజు, మంత్రి, సేనాధిపతి, సదాజి, గురాజి)

కైకా—ఈ వార్త సత్యమే?

సేనా—సత్యమే, కాని దురవగాహముగా నున్నది.

సదా—ఇరువదేండ్ల బాలుడు—

గురా—తరుణ వయస్కుడు—

సేనా—భువనైకవీరునివలె నున్నాడు; క్షణములో కోట కొల్లగొట్టెను.

సదా—రుస్తుముతప్ప తత్తుల్యవీరుడు కానరాడు.

గురా—అదియు సంశయాస్పద మనిపించుచున్నది.

కైకా—రుస్తు మెటనున్నాడు?

మంత్రి—తెలియరాదు.

రాజు—నాలుగురోజుల క్రిందట కబురంపితిమి—ప్రత్యుత్తరము లేదు-చిత్రముగా నున్నదే వాని వైఖరి—



మంత్రి—అది తప్పే. (రాణివచ్చును)

రాణి—మహారాజా! ఈ యద్భుతవార్త వింటిరా? వింశతివర్షీయుడు....సుకుమారుడు—మన రాజ్యమును గెలువ వచ్చెనేట! ఈ వార్త విని మనవారందరు భయవిహ్వలు లగుచున్నారు! మన వీరులెల్ల వాతాహతవృక్షసంతతివోలె త్రస్తులై ప్రకంపించు చున్నారు! ఏమి చిత్రము!

కైకా—వీరు దరుదెంచుట సత్యమే,కాని మేము భీతుల మగుట అసత్యము.

రాణి—అట్లైన తడయు టేల? యుద్ధమున కగ్రేసరులు గండు.

కైకా—రుస్తుమునకు వర్తమాన మంపితిమి.

రాణి—ఆతడు వచ్చెనా?

కైకా—ఇంకను రాలేదు.

రాణి—బాగుబాగు. ఆమరణ మాతనిరాకను ప్రతీక్షించుచుందురా? వాని ననుగ్రహాభిక్ష యాచింప నుంటిరా? ఆత డాజ్ఞాపించునటుల మీరు వర్తించుచుందురా? ఆతడు మీ యాజ్ఞల నధఃకరించుచుండ, సార్వభౌములగు మీరు ఆతని యనురాగమునకై వేచియుందురా? మీరు లోగడ ప్రతాడితులు, రాజ్యచ్యుతులు, ప్రవాసితు లగునప్పుడు ఏమని ప్రతిజ్ఞ గొంటిరి? "ఈ సింహాసనము నాకు లభించినచో ప్రజల ప్రీతిని సంపాదించి అనుకంపాయుతుడనై న్యాయపరిపాలన మొనర్తు"నని ప్రమాణము చేయలేదా? ఆ మాట లేమాయె!

అత్యాచారము పూర్వముకన్న పదిరెట్లు ప్రబలుచున్నది! రాష్ట్రమంతయు జనుల ఆక్రందనము లాక్రమించి యున్నవి. ఇట్టి దురాచారమును ధర్మదేవత చిరకాలము సహించునా? నియమ వ్యతిక్రమ మూరకపోదు. ప్రజల యుసురు తగులకుండునా? ఇంతక్షోభ యెన్నటికిని వ్యర్థముకాదు. అత్యుత్కటములగు పాపములకు ఫల మిహముననే అనుభూతమగును....(పోవును)

కైకా—సేనాధిపా, నీవీ క్షణమే పోయి రుస్తుమును సంకెలలు వేసి కొనిరమ్ము. (రుస్తుమువచ్చును.)

అందరు—అదిగో ఆతడే వచ్చెను!

కైకా—నాలుగునాళ్ల క్రిందట నీకు వర్తమాన మంపితిమి, సభకు వచ్చుటకు నావకాశము కలుగదాయెగా!

రుస్తు—అవకాశము చిక్కుట లేదు ప్రభూ.

కైకా—అబ్బా! ఏమి గర్వోక్తి!

రుస్తు—నాకా గర్వము?

కైకా—ఈయసడ్డకు తగిన సమాధాన మీయవలయు

రుస్తు—సమాధాన మీయవలయునా? నేను?

కైకా—ఈయుకొన్న—గు రాజీ—వీని చెరలోనుంచుము. నీకు శూలారోపణమే తగిన శిక్ష—తెలిసినదా?

రుస్తు—కైకాయుశ్-నేను రుస్తుము ననుమాట జ్ఞప్తి యున్నదా? నా ప్రసాదమున నీకీసింహాసనము లభించుట మరచితివా? నా వ్రేలిగోటితో నిన్నెగురజిమ్మగలను. ఈ రాజ్యమును స్వీకరించునిచ్ఛ నాకున్నచో నట్లు చేయలేక



పోతినా? నీకు సంకటములు ఘటిల్లినప్పుడు నిన్ను నేను పరిరక్షించుట మరచితివి కాబోలు. ఓయీ కృతఘ్నుడా! నీవింత విశ్వాసశూన్యుడవై నన్ను దండింపదలచి శిక్ష విధింతువా?....సరే. నీ విక్రమమును చూపి ఆసన్నసంక్షోభమును అపనయించుకొనుము. అసంఖ్యాకమగు తార్తారగణము శలభసమూహము పోలె నీపట్టణముపై పడనున్నదికదా? దేశమంతయు సంక్షోభించుచున్నది. మహామారియో, విప్లవమో, ఆసన్నమగునట్లు దేశమున హాహాకారము అతిశయించుచున్నది. నీ రాజ్యమును కాపాడుకొనుము. నీ వన నెంత? నీ కొలువన నెంత? రెండింటినిగూడ అధఃకరింతును, శక్తుడవైనచో నీ కష్టమును నీవే తొలగించుకొనుము... ....(పోవును.)

సదా—ఏమి మహారాజా! ఈ విపరీత చర్య!

కైకా—రాజునగు నాకు ఆతని శిక్షించు నధికారము లేదా? మీరందరు పిరికివారు కావున ఆతడు మీ తలపై తన్నిపోయెను.

మంత్రి—గతమును మరచి ఆ వీరశిఖామణిని నిండు సభలో నిట్లవమానింపవచ్చునా?

1775

(ఆఫ్రిదువచ్చును.)

ఆఫ్రి—పారస్యసార్వభౌమునకు జయమగుగాక!

కైకా—ఎవతె వీవు?

ఆఫ్రి—గుస్తాహాము కూతురను, నా పేరు ఆఫ్రిద్.

కైకా—ఇక్కడి కేల వచ్చితివి ?

ఆఫ్రి—బాలవీరుడగు సోరాబు పితండ్రిని వధించి మనదుర్గము నాక్రమించెను. అది చాలక ఇప్పు డీదేశమును జయింప వచ్చినాడు. ఈవార్త మీకెరిగించుటకు నేను వచ్చితిని; మీరీ యుద్ధతబాలకుని గర్వ మడచి మన దుర్గమును స్వాధీనపరచుకొనుడు. మీ రీక్షణముననే యుద్ధసన్నద్ధులు కావలయు. ఆతనితో ద్వంద్వయుద్ధము సేయగల వీరునొకని నిర్ణయింపుడు.

కైకా—అట్టివీరు డెవడు ?

గురా—మహారాజా! కొండ తలక్రింద నుంచుకొని రాళ్లను రోయనేల? రుస్తుమును రప్పింపుము. అనునయ వినయములచే నాతని సాంత్వన మొనర్పవచ్చును. ఆతనిచే కాని యీకార్యము నిర్వర్తితము కానేరదు.

సేనా—రుస్తుము రాకున్న ఈ బాలవీరుడు మనపట్టణమును మంటిలో కలపగలడు.

ఆఫ్రి—అందుకు సందియమేమి? అసహాయ శూరుడు!

సదా—ఇట్టి విపత్సమయమున ఆతడే మనకు పెనుగడ, అందర మాతని పాదములపైబడి వేడుకొందము.

కైకా—అనునయమున కాతడు లొంగునా ?

మంత్రి—ఆతని బుద్ధిని త్రిప్పుట కదియే మార్గము. స్వాభిమానియగు నాతడు తర్జనభర్జనములను లెక్కసేయడు.

కైకా—సరే అట్లే చేయుడు. మంత్రీ, నీవు పోయి



"నన్ను క్షమింపు"మని నేను వేడుకొంటినని చెప్పి బుజ్జగించి రుస్తుమును కొనిరమ్ము. (పోవుదురు)

—※—

## రెండవ రంగము

(రుస్తుము తన యింటిలో కూర్చుండును.)

రుస్తు—ఛీ! ఛీ! రాజుల నమ్మవచ్చునా? వారు నూతనప్రియులు, ఎదుట నున్నవాడే వారికి పెండ్లికొడుకు; అధికారమదాంధులు, అందు నీరాజు వయసున చిన్నవాడు, మంచిచెడ్డల నెరుగడు. వయోవృద్ధుడను విఖ్యాతవీరుడ నగు నన్నుకూడ మన్నింపడాయె, నా పదవిని తలంపడాయె, ఈ సింహాసనము తనకిప్పించితి నను విశ్వాసమైన లేదాయె. శత్రువులు దేశముపై దండువిడిసిరని విని చిరతరాబద్ధస్నేహుడ గాన ముదుసలియగు జనకుని సేవను వీడి "విషవృక్షోపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ"ని యెంచి, ఆహూతుడనై వెళ్లి అవమానింపబడితిని. ఇక వానిప్రశంస తలపెట్టరాదు.

ఆహా! వీరునిజీవిత మెంతనింద్యము! శరీరమున బలమున్నదువరకు యుద్ధమే కదా! ప్రపంచసుఖముల ననుభవించుటకు వ్యవధిలేదు.... నా మనము మధుపానమత్తమై యున్నది. అదే అరుణోదయ మగుచున్నది...నాకు సంసారసుఖము శూన్యమయ్యె. మహావీరుడ ననుఖ్యాతి దిగంతముల

వ్యాపించుటచే పాప మాతురానురాజకన్య నన్ను వివాహ మాడెను....ఇరువది వత్సరములు గతించెను. ఆమెను చూచు టకైన పోలేదు-కృతఘ్నుడనని ఆమె నన్ను నిందింపదా? తన్ను మరచెనని తల్లడిల్లదా?.... నేను మరువలేదు....వీర వ్యవసాయ మింతతో వీడి త్వరలో నామెను చూడబోయె దను.... (గురాజివచ్చును.)

గురా—జయము, జయము, శూరాగ్రేసరా!

రుస్తు—ఓహో! మిత్రమా, నీకు కుశలమా? నీ రాక నా కత్యంత మోదావహము. వార్తలేమి? ఫలముల నారగింపుము.

గురా—ఇది ఆరగింపునకు తరిగాదు. అత్యావశ్యకము లగు కార్యము లాసన్నమైనవి,....యుద్ధము సన్నద్ధమైనది. ఇరువీడులవారును తలపడు సమయమున తార్తారులు సోరా బను నొక బాలవీరు నెంచి ఆతనితో ద్వంద్వయుద్ధమున పోరాడజాలు వీరు నాయితము సేయుడనిరి.

రుస్తు—ఆ బాలవీరు డెవడు?

గురా—ఎవడో యెరుగము, కాని బలమున, చలమున, సాహసమున నద్వితీయుడని. వదంతి కలదు. పదలాఘవమున లేడిపిల్లను పరాక్రమమున సింహమును పోలును. ఆతడు తరుణ వయస్కుడు, మేము వయసుమీరిన వారము, అసమర్థులము; కావున మన సేనయంతయు నీ దెస ఆసతో చూచుచున్నది. నీకుతప్ప వేరెవ్వరి కాతనితో పోరుట అసాధ్యము. అయ్యా,



రమ్ము. లేనిచో పారసీకమునకు పరాజయము, పరాభవమును తప్పవు, నీవు ఉపేక్షసేయ జనదు.

రుస్తు—చాలు చాలు. మీరందరు వయసుమీరిన వారలైన నేను మీకంటె చిన్నవాడనా? పడుచువా రశక్తు లనిన మీ రాజుగారికి కోపము రాదా? ఆతడును వయసు కాడే. తన సైదోడుల నెప్పుడును మెచ్చుకొనుచుండును. ముదిసిన నాబోటుల పిల్చుట అతనికి గౌరవదాయకము కాదు. మాబోటివారి నతడు మన్నించునా? ....సోరాబు జగదేకవీరు డని పొగడ్తగన్న నాకేమి? నాకు కూతురు గాక అట్టికుమా రుడే పుట్టియుండిన, వాని యుద్ధములు నేయ బొమ్మని వృద్ధు డగు జనకుని సేవయందు కాలము పుచ్చుచుందునే....విశ్వాస హీనులగు రాజుల కొలువనేల? శత్రువుల చర్మము లొలువ నేల? నా కొడుకు యశము నార్జించుచుండ నే నానందాబ్ధి నోలలాడుదునే!

గురా—అయ్యా! ఆ బాలవీరుడు నీతో పోరెదనని ఘంటారవముగా భుజము లప్పళించుచుండ నీవు భీరునివలె జంకుటవలన లోక మెట్లు తలంచునో యించుక యోచించు కొనుము. నీ విన్నినాళ్ళు నార్జించిన యశమును ముక్కుపచ్చ లారని యొక మూఢ డింభకుడు హరించునేమో అను భీతిచే తల దాచుకొంటివని నిన్నందరును పరిహాసింపరా?

రుస్తు—అవేటి మాటలు? లోకమున శూరు లుండ రా?! నా కాలమున నేను-నే డీవీరుని వంతు వచ్చెను. ఫురో

వృద్ధిని గోరుచున్న బుడుతసి యెడ నా కసూయ యేల? జగదేకవీరుడని ధాత నా మొగముననే వ్రాసెనా?....ఆతడు శూరుడైన నా కవమాన మెట్లగును?....కృతఘ్నులగు భూపతుల గొల్వనోపను....నాయశము నాతడు హరింపజూచు నంటివి. నా కంఠమున జీవ ముండునంతకాలము అది సహింపనోపను....కదనమునకు గడంగెద గాని నేనువచ్చుచున్నట్లు నీవు ప్రచురింపవలదు, మారు పేరున మొద్దువారిన శస్త్రములతో పోరెద....కనుగందువుతో కలహించుట నాబోటి శూరునకు న్యాయ్యము కాదు. నీవు పొమ్ము. నీ వెనువెంటనే వచ్చెదను.

(పోవుదురు)

## మూ డ వ రం గ ము

(దుర్గశిఖరమున సోరాబు హుజీరు నిలుతురు)

సోరా—హుజీరూ, శత్రుశిబిరముల గాంచితివా?

హుజీ—చూచితిని.

సోరా—వీరులను పోల్చుకొన గలవా?

హుజీ—అల్లదె మంటపము, దానిపై ప్రభాకరప్రభల నీను ద్వజప్రకాండము తచ్ఛిబిరద్వారమున శతమణిఖచితకౌశేయమై రాజిలుచున్నది. మంటప మధ్యభాగమున రత్నసింహాసనము నలుదిక్కుల నీలకాంతుల నలముచున్నది. అదే రజతరజ్జువు రెండువైపుల పృథ్విని చుంబించుచున్నది. విపక్షవాహినీ కేంద్రమున నలుగడల గంధసింధురంబులు తొండము



లాడించుచున్నవి. అది పారసీకసార్వభౌముడగు కైకాయుసుని శిబిరము.

సోరా—అదే చూడుము. అశ్వారూఢులు, స్ఫీతవక్షులు, స్వర్ణవర్ణయుతులు నగు భటసమూహముచే రక్షితంబగు ఆ శిబిర మెవరిది? వీరి సమరోత్సుకత్వము ప్రశంసనీయము.

హుజీ—అది పారస్య సేనాధిపుని శిబిరము.

సోరా—ఆ రక్తవర్ణ శిబిర మెవరిది?

హుజీ—అగణిత తీక్ష్ణశూలధరావృతమై యుండు నాశిబిరము సదాజిది. ఆ వీరుల దీర్ఘకాయములు, రక్తనేత్రములు, కుటిలభృకుటి సముదాయము, ప్రభాతసూర్యకాంతి నపహసించు వారి వక్షస్త్రాణముల గంటివా? సదాజి యుద్ధైకనిష్ఠాపరుడు, అన్యవ్యవసాయ మాతనికి రుచింపదు—రణరంగమున నాతని దృష్టు లగ్నిని వర్షించును.

సోరా—ఆ ప్రక్క శిబిర మెవనిది?

హుజీ—పీతవర్ణ యుతమా?

సోరా—కాదు కాదు— శ్యామల రోహిత శిబిరము, శాల్మలీవృక్షప్రాంతమున నున్నది,....నలుదిక్కుల ముక్తామయము...తన్మధ్యమున వీరుడొకడు పొడగట్టుచున్నాడు...ఆ దీర్ఘవపువు, గౌరకాంతి, సౌమ్యమూర్తి, స్థిరదృష్టియు గలిగి కన్నులకు విందొనర్చుచున్నాడు. శిబిరమున గరుడకేతన మల్లలనాడుచున్నది. తత్సముఖమున నుచ్చము శ్వేతము బలిష్ఠము నగు నశ్వ మున్నది. దాని హేష వినువారిని కలగుండు వెట్టుచున్నది. అదెవరి శిబిరము?

హుజీ—అతడు చీనాదేశీయుడగు వీరుడు పేరెరుగను.... సమున్నతమరకతఖచితము పీతాభమునగు ఆ శిబిరము చూడుము. వ్యాఘ్రలాంఛన మెగురుచున్నది- అగణితకిరాతదాసపరివృతము-అది సదాజిపుత్రుని శిబిరము—

సోరా—ఆతడు చీనాదేశపు వీరునివలె లేడు.

హుజీ—ఆ శుభ్రశిబిరమును తిలకించితివా? శ్వేతకౌశేయ వేష్టితము-అది పారస్యరాజకుమారుని శిబిరము—

సోరా—శ్యామలశిబిరమునయున్న గౌరవీరుని పేరేమి? నిజము చెప్పితివేని నిన్ను చెఱనుండి ముక్తుని జేయుదును.

హుజీ—ఆతని పేరెరుగను - పారసీకవీరుడు కాడు-క్రొత్తవానివలె నున్నాడు.

సోరా—ఆతడే రుస్తుము కాబోలు.

హుజీ—ఇతడసాధ్యునివలె నున్నాడు_నేనెంతమరపింప జూచినను రుస్తుముపై తన దృష్టినిలిపి తుదకు పేరు కూడవచించెను. ఈతనికట్లు నాకపటము సాగునట్లు తోపదు, కానిమ్ము. ఇట్లు చెప్పి చూచెద- (ప్రకా) ఆతడు రుస్తుము కాడు.

సోరా—అట్లయిన రుస్తుమేడీ?

హుజీ—ఆతడీయుద్ధమునకు వచ్చినట్లు లేదు. అతని బాగుగ నెరుంగుదును. ఈ వీరులలో నతడు కానరాడు.

సోరా—నీవు సత్యము బల్కితివేని నీ దాస్యమును తొలగించి నేను జయించిన ఖీవా దుర్గమునకు నిన్నధీశ్వరుని



చేసి స్వతంత్రప్రభువు నొనర్చెదను. నీకు కావలసినంత ధనమొసంగెద-రుస్తుమును చూపుము- యుద్ధసమయమున విఖ్యాతయశుడగు నాతడు వెనుకంజ వేయడు_ఈవీరులలో నొకడై యుండును. నీకు తెలిసినచో నిక్కమును వచింపుము-

హుజీ—అయ్యా! నన్ను విశ్వసింపుము. రుస్తుమును నే నెరుగుదు- అతడిట కానరాడు. తనకీర్తిని వెంటబెట్టుకొని ఎటకో పోయెను,- యుద్ధభూమిని ఆతడు నిల్చునపుడు దర్పోద్ధతమగు నాతనిమకుటము పర్వతశృంగమువోలె ఉన్నతమగును. ఆతడు వీరమదగజములమధ్య మృగరాజును పోలియుండును. ఆసముద్రవిఖ్యాతయశుడగు ఆతని అరణ్యమందలి మృగములుకూడ ఎరుగును. అతడీసమరమున కరుదేరలేదు.

సోరా—అట్లైన సరిసరి....(పోవును)

హుజీ—అమ్మయ్యో- ఏమి ఈతని వివేకము!.... రుస్తుము నీతడు పోల్చుకొనకుండుట మేలయ్యె- నిజ మీతని చెవిని సోకనిత్తునా? వీరిద్దరు నన్యోన్యపరిచితులైన నిక నున్నదా? ప్రపంచమంతయు నొక ముద్దగాజేసి మ్రింగరా?— వీరొకరినొకరెరుగకుండిన ద్వంద్వయుద్ధము తప్పదు. అందీతని మరణము అవశ్యంభావి...,సోరాబూ,—నీ రక్తముచే సిక్తములగు నా హస్తములతో ఆఫ్రిదుపాణిని గ్రహించెదను. నాకు కైగతమైన నవలాశిరోమణిని నీవపహరింప జూచుచున్నావు కావున నీకు మరణమే శిక్ష.

(హూమాన్ వర్మాన్ తోఁగూడి సోరాబు వచ్చును.)

సోరా—హూమాన్, ఆ శ్యామలశిబిర మెవనిదో చూచి చెప్పుము.

హూమా—ఆత డెవడో నే నెరుగను,

సోరా—వర్మాన్ ! నీవు చూడుము.

వర్మా—ఆత డెవడో క్రొత్తవాఁడు—

సోరా—రుస్తుమేనా ?

వర్మా—కాఁడు కాఁడు.

హూమా—రుస్తు మేడ ? ఆత డేడ ?

సోరా—మిత్రులారా ! రుస్తుము నాతండ్రి, నే నాతనితోఁ బోరను. పుత్త్రుఁడు తండ్రిపైఁ గత్తి నెత్త నగునా ? ఆ పాపమును నా తలకు చుట్టకుఁడు. నా యందు దయయుంచి ఆతడు రుస్తుమైనచో దాపక చెప్పుఁడు.

హూమా—అయ్యా ! మేము నీతో నసత్య మాడుదుమా ? నీ యెడ నిజము దాచుదుమా ? ఆతడు రుస్తుము కాఁడు. మా మాట నమ్మవేమి ?

సోరా—సరే- మిమ్ము విశ్వసించితిని, యుద్ధమునకు వలయు నేర్పాటుల నొనర్పుఁడు...రుస్తు మేల రాలేదో తెలుసుకొనవలయు.

హూమా—అయ్యా, మమ్ము పలుమాఱు పరీక్షించిన నేమి సమాధాన మీయఁగలము ? గుసగుస శూరతాగరిమ



మే మెరుఁగనిది కాదు. ఆతడు సంతతజయప్రదుడు, సమరరంగమున నాతఁ డోడుట కని విని యెరుంగము. అతఁ డెప్పుడును సేనాముఖమున నుండును...ఆతఁ డిట గానరాడు. వయసు మీఱె కావున శస్త్రసన్యాసము కావించెనో, ముసలితండ్రికి సేవజేయుచు నిజ దేశమున నిల్చెనో, పారసీక నృపునిపై సగఁగొని యుద్ధమునకు వచ్చుట మానెనో ! ఆతఁడుండిన మనకు జయము శంకాకులము కాని ఇప్పు డవలీల మనము దీనిని జయింపవచ్చును.

సోరా—(దీర్ఘాలోచనాపరుడై పోవును)

వర్మా—వీనిని చక్కఁగా వంచించితిమి. నిజ మెరిగింప రాదు.

హూమా—అబ్బ ! నే నెఱుఁగనా ? నిజమెఱిగిన నీతఁడు పోరు నెట్లు ? రుస్తుముచే చచ్చు టెట్లు ? పారసీకము మనకు వచ్చు టెట్లు ? ఇద్దరికిని పోరుపొసగకున్న మన ప్రయత్నములు సాగనేర్చునా ? (పోవుదురు)

హుజీ—రాజ్యకాంక్షచే ! వీరు నిజము చెప్పరైరి, ఇదియు మంచిదే. ద్వంద్వయుద్ధమున నెవ్వరేని చావకతప్పదు ఆ క్రిందు నాకు దక్కకతప్పదు



## నాల్గవ రంగము

(సమిరఖండాంతఃపురము — తామినా)

తామి — ఇన్నిదినములు గడచినను సోరాబు కుశల వార్త నంపుటలేదు. ఎద్దియేని ఆపద ఘటింపలేదు కదా! లేదు లేదు.... రుస్తుమసుతుడగు సోరాబున కాపదయా? నే నెంత మూఢురాలను! మాతృప్రేమ సంతానమునెడ నెప్పుడును ఆపదనే శంకించుచుండును. వారెట్టి యానందాబ్ధి నోలలాడుచున్నను తల్లి మనసున పాపశంక మానదు.

(జుయారా, రాజును వత్తురు.)

రాజు — వింటివా అమ్మా? నీ సుతుని పరాక్రమాతిశయము.

తామి — సోదరా, నా సుతు డేడీ?

రాజు — ఇరానుప్రవేశదుర్గము నాక్రమించి రాజధానిపై నేగెను. పారసీకరాజు ప్రబలసైన్యము నాయత్తపరుచుచున్నాడట, రుస్తుము సేనలో నుండితీరును.

తామి — నా నాథు డుండుట నిక్కమా?

రాజు — అతడు చిరకాలమునుండి పారసీకరాజునకు బాసటయై యున్నాడు; ఈ ఘోరయుద్ధమునకు రాకుండునా?

తామి — తండ్రికి విపక్షుడై సోరాబు నిల్చిన ప్రమాదము—



రాజు — రుస్తుమునకు సోరాబు తన సుతుడని తెలియదా?

తామి — అత డెఱుంగడు. ఒకరి నొ[illegible] ఆపద మూడునేమో? బాలుని పరాక్రమమునే లెక్కచేసి పోరజూచునేమో? ఒకవేళ తనయుడనని చెప్పుకొన్నను నా నాథునకు నేను జ్ఞప్తియందున్నానో లేనో? — సోదరా, నా తనయుని మృత్యుముఖమున వీడి వచ్చితివా?

జుయా — నన్నేమిసేయుమందువు? — రుస్తుము పారసీకసేనలో నున్నాడని యెఱింగి సోరాబును రమ్మనుమని మొఱపెట్టితిని. అతడు నామాట పెడచెవిని బెట్టి ఎటులైన తండ్రిని చూడక మాననని పట్టుబట్టెను. యుద్ధము తప్పదు కావున నూతనసైన్యమును గొంపోవ నే నిట వచ్చితిని.

రాజు — యుద్ధమున మనకు జయము తప్పదు. నీ కాందోళనమేల?.... (వారు పోవుదురు.)

తామి — జుయారా వట్టి వెఱికి. తండ్రిగారి పెద్దియు తెలియదు.... నా సుతుకు తండ్రియెడ నెట్లు ప్రవర్తించునో? నా నాథు నెవ్వరేని వానికి చూపుదురో చూపరో? బలము చూపి చలము సాధించునట్లు వీరిలిద్దరును [illegible] మరతురేమో? ఇద్దరు అనన్యసామాన్యశూరులు మరణమునకు జంకక మత్సరము పూనుదురేమో?.... ఎట్టి సంకటము ప్రాప్తించునో? దీని కంతటికిని కారణము నా అవిమృశ్యకారితయే.... జుయారాను వేగము రుస్తుముని కావించెద ... పరమేశ్వరా!

మా కుటుంబమునకు నేడును శౌర్యము.... ందెద్దియో సర్వనాశ మాసన్న మగునట్లు స్ఫురించుచున్నది. విపద్దేవత అనుగ్రహపు వడు వినవచ్చుచున్నది, నాచిత్తము తత్తర పడుచున్నది; ఏమిచేయుటకును తోచదాయె....



## ౯ దవ రంగము

(దుర్గబాహ్యప్రదేశమున రుస్తుము శిబిరము.)

రుస్తు—సోరాబుని వీరత్వప్రశంస వింటిని — వాని బల పరాక్రమముల కంటిని అట్టి పుత్త్రుడు కల్గు భాగ్యము నాకు లేదుకదా అని చింతించితిని....అసంభవము! నాకు పుత్త్రుడెక్కడ? ఇతడెవడో?....ఎవడై యుండును?

(కైకాయుసు వచ్చును.)

రాజు—వీరవరా! సోరాబు సైన్యము నా సైన్యమును నిర్మూలించుచున్నది. నీ వేల సమరవిముఖుడ వైతివి?

రుస్తు—మీ వీరుల విక్రమప్రాకట్యమును గనుచుంటిని. మీ రాజ్యమును ప... యశమును కాపాడుకొనుట కిదియే తగిన యదను. నా చేత నేమగును! యువకులు మీరు పోరు సల్పుడు.

కైకా—పారసీకవీరశిఖామణి! కోపము ...కు అలసతకు సది యదనుకాదు. ...ప్పనాశము కానున్నది, ...కహాస్యముమాని



కార్యమునకు గడంగుము. విపక్షవాహినితో తలపడి విలయకౌశానులీల విజృంభింపుము; లెమ్ము. నన్ను దిక్కులేనివానిగ జేయుదువా? నా తప్పులన్నియు మన్నించి నా రాజ్యమును రక్షింపుము. అధికారమదమున నిన్నవమానించితిని నీవే నా సంపద. నీవే నా తోడు-నీవుండే నా ఆశల కత్తిప్పము చేసితిని. శరణంటిని, కరుణింపుము. ఆర్తత్రాణపరాయణా, నా ప్రజల నుద్ధరింపుము.

(తెరలో ఓయీ! పారసీకరాజా, భీరునివలె శిబిరమున దాగితివా? బైట రమ్ము, చూచెద నీపరాక్రమము)

కైకా—వింటివా ఆ బాలుని వీరాలాపములు? నిన్ను శరణుజొచ్చిన వాని నింకొకడిట్లు అవహేళనము చేయుచుండ విని యూరకుందువా? ఇదే వేడుకొనుచున్నాను. యుద్ధభూమి నవతరింపుము.

రుస్తు—రాజా, భీతి వలదు-ఇదే యుద్ధభూమి నురుకుచున్నాను. నా అశ్వము నాయత్తపరుప నాజ్ఞనిచ్చి నేను సన్నద్ధుడ నయ్యెదను....(పోవును)

కైకా—ఇక భయము లేదు. సుప్త సింహము మేల్కాంచెను. అమ్మయ్యా! బ్రతి... (అఫ్రిదు వచ్చును) వీరబాలా! రుస్తుము సమరసన్నద్ధుడగుచున్నాడు.

అఫ్రి—అట్లైన నా తండ్రి స్మృతికి ప్రతీకారము సిద్ధము. ఇక సోరాబు మస్తకము భూమిపై ప్రదొర్లక మానదు. అహా! ఏమి యానందము!

కైకా — నారీమణీ! నీ జిఘాంస ఆశ్చర్య మొదవించు చున్నది ఆడుదానవు! నీ కింత పరాకాష్ఠ యేల ?

ఆఫ్రి — ఔను-నే నాడుదాననే-మేము నదులవంటి వారము. ప్రీతుల మైన సుఖదుల మేఁకలస్వనము-మందహాసము-ఆటపాటలు-హంసగమనము, అగాధప్రేమ-వీనితో తప్తతటతలముల స్నేహార్ద్రములుగను సస్యశ్యామలమనోహరము లగు నట్లు చేయుదుము-కోపము వచ్చినా, ఉత్తాలతరంగములు, భీషణఝంకారము, అనర్గళప్రవాహము — మొదలగువానితో నొడ్డులను భగ్నమగ్నములుగ జేసి ఉన్మూలించి ఇసుకపఱ్ఱలుగా జేయుదుము. స్నిగ్ధవృష్టిధారల పృథ్వికి జీవనదాయకములగు మేఘములే పిడుగులను పడ జేయును. రమణి ప్రసన్నరాలాయెనా, ఆమెకంటె సుందరతరమగు వ్యక్తి లేదు; విముఖురాలయ్యెనా, తత్తుల్య భయానకమగువ్యక్తి యుండబోదు.. సోరాబు నాచేత జిక్కెనేని ఈనిన పులి ఆమిషమును చీల్చునట్లు ముక్కముక్కలు చేయుదును-పిమ్మట ....ఆవెన్క....అతని రక్తస్నాపిత శరీరమును నా బాహులతికల పెనవేసి, అతని వదనమును నా బాష్పవృష్టిచే నార్ద్రము చేసి, చెక్కిలి ముద్దు... అధరామృత మానని చ్చెదను. రుధిరాక్తమగు తచ్ఛిరము స్వక్రోడమున నుంచుకొని ఇష్ట దేవతవలె నారాధింతును....సోరాబూ! బాలవీరా! నాకు గర్భశత్రుడవైతివి. ... సశిరము, ఆ మతిపటిమ, అతియశౌర్యము, ఔదార్యమును గాని నీవు నా వాడవని



యెంచి యుల్లోకము నాబోటి ధన్యురాలు లేదని ఉప్పొంగితిని, హర్షాశ్రువుల నొడ్చితిని....నా పితృఘాతకుడవు గాన ప్రతిహింసాపరాయణురాల కావలసి వచ్చెను నా తండ్రికొఱకు నీమృత్యువును కాంక్షించుచుంటిని; నా కొఱకు నీ ప్రేమను కాంక్షించుచుంటిని....ముందుమరణము, ఆవెన్క వరణము.... వ్యత్యస్తమయ్యె....దౌర్భాగ్యురాలను.

కైకా — ఈ కాంత చర్య విపరీతముగా నున్నది....

## ఆ ర వ ర ం గ ము

(వీరవేషముతో రుస్తుము నిల్చును)

రుస్తు — ఆహా! ఏమి యీ సోరాబు సోయగము! ప్రమదాశిరోమణులు కేళికోద్యాన జలప్రవాహముల చెంత అతిగారాబమున పెంచిన గున్నమావివలె రాజిల్లుచున్నాడు!

(సోరాబు వచ్చును)

వీని చూడ వైర మంతరించి ఆహ్లాద ముదయించు చున్నది. బాలవీరా! నీకు ప్రాణములు తీపి కావా?.... నా బాహుబలము నీ వెఱుగవు....ఎందరో వీరులు నా చేత మడిసిరి. నాకపజయమున్నది లేదు....నమ్మిగోరి చెప్పుచున్నాను, నాతో మా దేశమునకు వచ్చి సుతకల్పుడవై వర్తింపుము, నీబోటి బాలవీరు లీదేశమున లేరు....రణము మానుము.

సోరా — నీవు చెప్పినట్లు చేసెద కాని ముందు నా ప్రశ్నకుత్తర మిమ్ము. నీవెవడవు? రుస్తుమువే నా?

రుస్తుము—రుస్తుము! రుస్తుముతోనా పోరాడెదవు? ఇరువదేండ్ల వాడవు!

సోరా—ఇంతకాలము నాతోడ సమపరాక్రమము తో పోరగల్గిన వీరుడవు నీ వొకడవే. సత్యము బల్కుము—నీవు రుస్తుమువేనా?

రుస్తు—నేను రుస్తుమును కాను, రమ్ము పోరికి. బాల వీరా! మన ద్వంద్వయుద్ధమునుబట్టి పారసీక తార్తారుల జయాపజయంబులు నిర్ణీతములగును.

సోరా—జ్ఞప్తియున్నది.... నేను సిద్ధముగా నున్నాను. నీవు శ్రాంతుడవైన నించుక తాళెదను. నీవు వయోవృద్ధుడవు, నాకు శ్రాంతి యనునది లేదు.

(యుద్ధము చేయుదురు.)

రుస్తు—ఆగు మాగుము. సూర్యు డస్తమింపనున్నాడు. అస్త్రయుద్ధమున నాకు సముడవు, మల్లయుద్ధమున పోరుదము.

సోరా—అట్లే కానిమ్ము (అస్త్రముల వీడుదురు.)

రుస్తు—మల్లయుద్ధనియమమును వినుము, గెల్చినవాడు ఓడినవాని తత్క్షణమే త్రుంపవలయు—పారస్యపద్ధతి ఇది.... నీకు సమ్మతమా?

సోరా—మంచిది, మీ నియమముల ననుసరించియే పోరుదము; దీనికి నేను వెనుదీయను; కాని యుద్ధమునకు గడంగక పూర్వ మొక ప్రశ్న నడిగెద. నీవు రుస్తుముడ కావా? నిజము చెప్పుము—నీవే రుస్తుమవైన నిన్ను చంపను.



రుస్తు—అటులనా? ఏమి నీపొగరు! కసుగందువు నీవు జాలిచే రుస్తుమును చంపజాలవా? ఏమి నీ గర్వము!

సోరా—కాదు, కాదు—ఇందు పొగరుగాని [illegible]గాని లేదు—రుస్తుము నా కేమగునో నీ వెరుగుదువా?

రుస్తు—తెలుసుకొన నక్కర లేదు. రమ్ము పోరికి—పోరికి రమ్ము. మారుమాట వలదు. ఇందు పరాజితుడవైతివేని వెంటనే నీ శిరము తెగును. నే నోడితినా, నన్ను నీవు చంపవలయు.

సోరా—అట్లే కానిత్తము.

రుస్తు—సిద్ధముగా నుంటివా?

సోరా—సిద్ధముగా నున్నాను.

(యుద్ధమగును, రుస్తుము క్రింద పడును. సోరాబు కత్తినెత్తి) చంపనా?

రుస్తు—వలదు. రెండవసారి నేను క్రిందైన చంపుము, తొలిసారి వలదు.

సోరా—అట్లే కానిమ్ము; లెమ్ము. (ఎత్తి) ఇంకొకసారి పోరుదమా?

రుస్తు—వీరవరా, ఇప్పుడు చీకటి పడినది, యుద్ధమును చాలించి రేపు పెందలకడ పోరుదము.

సోరా—అట్లే కానిమ్ము—నే నెప్పుడును సిద్ధుడనే.

రుస్తు—ఇచ్చటనే, రేపు తరువాత రమ్ము.

సోరా—[illegible]

(రుస్తుము తలవంచుకొని పోవుచుండ సోరాబు చూచును.)

సోరా—ఈత డెవడు? ఈతని యెడ నిట్టి ఆదరస్నేహ… ,నా మనమున నుత్పన్నములు కానేల? పరాజయ సూచకములగు నీతని మ్లానవదనము, నతశిరము, స్తంభితాంగయష్టియు జూడ నా ప్రాణములు హృత్పిండమును చీల్చుకొని "వాని పాదములపై బడి క్షమను యాచింపుము"ని మొరవెట్టుచున్నవి....ఏమి నా కీభ్రాంతి?.... ఈ జయమున నా కుల్లాసమే జనింపదు. మహావసాద సమాచ్ఛన్న మగుచున్నది నా హృదయము. ఈతడు రుస్తుము కాబోలు. లేనిచో నాకీ తత్తరపాటేల?

(హుమాన్ వర్మాన్ వత్తురు.)

హుమా—ఎంత పని చేసితివి!

సోరా—ఏల?

వర్మా—పరాజితు నొనర్చి పంపితివా?

సోరా—ఇందు ప్రమాదమేమి?

హుమా—ఎంత పొరపాటు!

వర్మా—చంపక విడిచితివా? నల్లత్రాచు నడుముపై నడుగువేసి వీడితివా?—ఎంత పని చేసితివి!

సోరా—రేపు తిరుగ యుద్ధము కాగలదు. ప్రభాతమున నే- మించిన దేమున్నదిపుడు?

హుమా—అయ్యో! చేతజిక్కిన చెనటిని వీడుదురా? వెంటనే చంపవలసినది.



సోరా—మిత్రులారా, అతని చంప నా చేతు లాడవాయె! అతడు భూశాయి అయినప్పుడు ఖడ్గము నెత్తి "చంపనా" అని అడుగుసరికి ఎవరో నా చెవిలో బిగ్గరగా "సావధానుడవు కమ్ము–మూఢుడా! ఏమి చేయుచుంటివి" అని అడిగినట్లాయెను. అతడు క్షమింపుమని అడుగకముందే నే నాతని క్షమించితిని. యుద్ధప్రారంభమున "సోరాబూ" అని అతడు పిల్చినతోడనే ఆధ్వని నాకు చిరపరిచితమైనట్లుండెను. మల్లయుద్ధమున ఆతని చేతితో నా చేయి కలుపుసరికి ఆతని నాశ్లేషింపవలయు ననుకోర్కె పుట్టెను. ఆత డెవడో, ఆతని వృత్తాంత మెద్దియో నా కగమ్యగోచరముగా నున్నది- మీకు తెలిసిన చెప్పరా? నా ప్రతికక్షి యెవడు?

హుమా—వీరాగ్రేసరా, చిత్తమును పదిలపరుపుము. దుర్బలుడగు శిశువుబోలె కంట నీరుపెట్టుచున్నావు, ఇది తగదు నీకు. నిమ్మళుడవు కమ్ము. కోమల హృదయమును దృఢపరుపుము. ఇది యిల్లుకాదు, రక్తాక్తము నిర్మమ మగు యుద్ధరంగము.

వర్మా—చీకటి పడినది, పోదము రమ్ము.



## ఏడవ రంగము

### రుస్తుము శిబిరము

ఆఫ్రి—సోహ్రాబూ! సోరాబు! ఎట్టి మోహపాశమున నన్ను బంధించి నీవెంట త్రిప్పుకొనుచుంటివి! ఆనాఁడెట్టి ముహూర్తమున యుద్ధక్షేత్రమున మొట్టమొదట నీముఖసందర్శన మాయెనో, అప్పుడే నీవలలోఁ బడితిని. పృథ్వియందలి సౌందర్యరాశికెల్ల నీవే ఆటపట్టనియు, ఆనందమునకెల్ల లీలాభూమి వనియు, అన్వేషణములకెల్ల ప్రాప్తిభూతుడ వనియు భావించితిని. వీరప్రతిభయంతయు పుంజీభూతమై నీయందు పుంభావము ధరించెననియు, పవిత్రప్రణయచికీర్ష నీముఖమున సువ్యక్త మగుచున్నదనియు నెంచితిని. ఆహా! ఏమి అలభ్యసౌందర్యము, ఏమి నిస్తులానందము, ఏమి అలౌకికమహిమ....నిన్నెంత మరువ యత్నించిన అంత దిటముగా నా హృదయ కుహరమున నాటుకొనుచున్నావు. స్నేహాగ్నిని చల్లార్ప బాష్పముల వార్చినకొలది అది ప్రజ్వరిల్లుచున్నది! నా దేశమునకు శత్రుడవు కాక-నాతండ్రిని జంపకుంటివేని... వలదు....ఆ మాట నిక తలపెట్టను....నీవు. నాకు నిసర్గ వైరివి....నీ యెడ ననువర్తింప దగు రీతిని తప్పుదాన గాను.

(క్రైకాయుశు వచ్చును)

రాజు—యుద్ధ మెట్లు పరిణమించె? రుస్తు మింకను రాలేదా?



ఆఫ్రి—శత్రువధ సేయక వచ్చువాడు కాడు....ఆ మాట ఆతనినోట వినవలయునని నే నిట వచ్చితిని....రుస్తుము సోరాబును చంపితీరును; మీరు చింతఁ తొలగి యుండుడు. నే నొకని కడతేర్చితిని- రెండవ వానిని రుస్తుము రూపుమాపును.

రాజు—నీవు శత్రువును చంపితివా?

ఆఫ్రి—నిస్సంశయముగా. అంతతో గాని నా తండ్రి మరణమునకు ప్రతిక్రియపూర్తి కాబోదు.

రాజు—నీ వెవని చంపితివి?

ఆఫ్రి—మా దేశమునకు ద్రోహి, విశ్వాసఘాతకుడు, నాకు పితృవంచకుడు నగుహాజీరును— నేను చంపితిని. నిన్న సమరక్షేత్రమున విచ్చలవిడిగా తిరుగుచున్న ఆ పాపిని చూచితిని, సోరాబు వాని చెఱవిముక్తుని చేయగా, ఆ కుటిలుడు మా శిబిరమునకు మగుడ వచ్చెను—తోడనే వాని నేనంత మొందించితిని....ఇక మిగిలియున్నవాడు, సోరాబు—ఆతని మరణవార్తను ప్రతీక్షించుచున్నాను.

(లోన తూర్యధ్వని)

అదే రుస్తుము తూర్యధ్వని—

రాజు—వీరాధివీరా! ఆ తుంటరిని తునుమాడితివా? ఏదీ ఒకసారి గాఢాలింగన మిమ్ము.

రుస్తు—మహారాజా! నేటి యుద్ధమున నేను వీగితిని.

రాజు—ఏమీ! నీ వోడితివా!

రుస్తు—ఔను-మొదట సైన్యము లొండొంటితో పోరుసల్పెను. మనవీరుడు వారధికముగ కూలుట చూచి తులారణము నావీరుడు చాటెను. నేనొప్పుకొంటిని, అందు జితుడనైతిని. రేపు పోరు తిరుగ జరుగగలదు.

ఆఫ్రి—రుస్తుము! సోరాబును చంపలేక పోతివా! నీ బాహుబలమేల? నీ కీర్తి యేల! అయ్యో! ఇరువదివత్సరముల బాలున కోడితివా? జగదేకవీరుడవా? ఓడుటకన్న ప్రాణముల వీడుట శ్రేయము కాదా? భీరూ! రేపు నేను యుద్ధమునకు పోయి అతని చంపెద, లేదా నేను చచ్చెద.... ఛీ, ఛీ, వీరాధివీరుడవట! వింశతివర్షీయునకు వీగితివి, ఇంతకన్న హేయమగు అవమాన ముండునా?....(పోవును.)

రాజు—వింతగా నున్నదే!....(పోవును)

రుస్తు—నా బాహుబల మంతయు నెటపోయె? ఎందరినో ప్రఖ్యాతవీరుల గెల్చియు ఈ బాలున కోడితినే? యక్షరాక్షసదైత్యకులముల నిర్మూలింపదగు అసహాయశూరుడను-నా పేరువినిన త్రిభువనములును గడగడ వడంకునే! అట్టి నా శౌర్యము నేడు మొక్కవోయెనా?......ఆ వీరు డేలొకో పలుమారు "నీవు రుస్తుమువా?"అని నొక్కి నొక్కి అడిగెను. "నేను కాన"నిఅసత్య మాడితిని-ఇరువది వత్సరముల బాలకునితో రుస్తుము పోరుసల్పునా? అను లజ్జచే నట్లంటిని, కాని వాని గెలువలేనైతిని....నాకు ప్రాణముకన్న కీర్తి యెక్కువ. "రుస్తుమును నేను జయించితిన"ని



బాలుడు సంతసింపకుండునటుల నేను అబద్ధమాడితిని; కాని ఇప్పు డేమయ్యె? పాప మా బాలు డెరుంగడు తాను రుస్తుము నోడించినట్లు-ఇంకొక రోజులో నీ మాట లోకమంతట ప్రాకును; అందరు నన్నెకసక్కెము లాడుదురు, అవమానవహ్ని నా యొడలెల్ల దహింప నది సిద్ధమగుచున్నది....హా, పరమేశ్వరా! రేపటి యుద్ధమున ఆతని జయింపజాలు బలమును చలమును ప్రసాదించి నాకు జయమును చేకూర్పుము. ఇంతకన్న వేఱు కోరను. నా భావిసుఖము, శాంతి, సంపద, అంతయు ఉపసంహరించి కేవలజయము నొసంగుము; వేరేమియు కోరను-....అబ్బా! దుఃఖము దుర్భరమగుచున్నది. మధ్యపానమున దీని మరతును.

—— :0: ——

## ఎనిమిదవ రంగము

(యుద్ధభూమిని సోరాబు)

సోరా—ఎరుగలేనైతిని! ఆవీరుడే....సముద్రమునుబోలు ప్రసారితవక్షము-పర్వతమునుబోలు సమున్నత దేహము-కన్నుల వజ్రిజ్వాల-కంఠమున గంభీరమగు ఘనధ్వని-ఇట్టి శుభలక్షణము లింకెవని కలవగును? ఈతడే రుస్తుము కానోపు. నా చిత్తము అత్యుత్కటమైన ద్వైధీభావమున కాశ్రయమయ్యె. నా విజయగౌరవము శూన్యమయ్యె. అంగసముదాయము నుండి బలము చలమును జారుచున్నవి....పూనిక యంతయు జీర్ణవస్త్రముభాతి శీర్ణమగుచున్నది-హా జనకా! జనకా!

(రుస్తుము వచ్చును.)

దయ చేసితివా? వీరాధివీరా!

రుస్తు—వచ్చితిని, సోరాబూ! మన కిదే చరమయుద్ధము. ఇందు నీవో నేనో ప్రాణముల బాయవలయు. సిద్ధముగా నుంటివా!

సోరా—అయ్యా! ఇంక శాంతింపుము. అస్త్రము నట నుంచి రమ్ము. మన మొండొరుల కరముల కీలించి వక్షములొరయ గాఢాలింగన మొనర్చి, జగదీశ్వరుని క్షమాభిక్ష యాచింతము. పరస్పర స్నేహ మహాప్రవాహమున విద్వేష పర్వతమును ముంచివేయుదము.... నిన్ను చంప నా చేతు లాడకున్నవి, పాణి మోర్వకున్నది, మన సొప్పకున్నది. ఉన్నత ప్రదేశమునుండి నిమ్న ప్రదేశమునకు బోవు నీరువలె నా భావప్రవాహము నీవైపు పరుగు లెత్తుచున్నది. నీవు నాకు వైరివి కాక పురాతన బంధువువలె తోచుచున్నావు. ఏలొకో నా హృదయమునుండి గభీర స్నేహప్రవాహ ముత్పన్నమై కన్నుల నానందబాష్పపూరితములుగ జేయుచున్నది—నా చింతన మంతయు నీయందే లీనమగుచున్నది, కారణ మరయజాలను—ప్రియతమా! నీ యెడ నే నపచార మొనర్చిచితిని—నిన్ను చూడగనే అనిర్వాచ్యమగు ప్రేమ-గౌరవము-త్రప-భీతియు నా మనసు నలముచున్నవి. దాక్షిణ్యశాలివై న న్నక్కున జేర్చుము.

రుస్తు—అట్లు జరుగనేరదు. స్నేహము, అనుకంప మొ,



లగు కోమలప్రవృత్తుల నా చిత్తమునుండి పారదోలితిని. నా మనోభావము లన్నిటిని నీ జిఘాంసయందు కేంద్రీకృత మొనర్చితిని. నేడు నిన్ను చంపక విడువను. నిన్నటి పరాజయము అవమానమును హృన్మర్మ వ్రణములవలె నన్ను పీడించుచున్నవి. ఆ బాధజ్వాల నా మస్తిష్కమందు, సర్వాంగములయందును భగ్గుభగ్గున మండుచున్నది. నీకు నేడు కరలాఘవము కన్న పదలాఘవ మెక్కుడయినట్లున్నది.

సోరా—కావున నీచే నేను పరాజితుడను. నన్ను నీ యిచ్చవచ్చినరీతి నవమానించుము. సర్వసేనాసమ్ముఖమున నే నోడితినని ఒప్పుకొని నిన్ను జీవభిక్ష యాచింతును, అస్త్రమును విడువుము.

రుస్తు—ఆడుదానివలె దైన్యము నొందితివని నిన్ను విడెదనని తలంచితివా? భీమతేజమున నేను యుద్ధమునకు కడంగితిని. నిన్ను వధింతుననియు లేకున్న ప్రాణముల త్యజింతుననియు నేడు భీష్మించితిని. నా శిరము ద్రుల్లి నీ యశము ప్రజ్వరిల్ల జేయవలయు, లేదా విజయగర్వోన్నతమై శిబిరమునకు బోవలయును.

సోరా—నా మనవిని—

రుస్తు—వినను. మాటలతో పనిలేదు. నా సంతానమును వధింపవలసి వచ్చినను నేడొనర్చిన ప్రతిన పూర్తి చేయక మానను. నీ ప్రాణము లుండజాచుకొనజాలవు.

సోరా—సంతానము నేని సరకు గొనవా? అట్లైన రమ్ము పోరికి.

(యుద్ధము కాగా సోరాబు కత్తి వేటుచే రుస్తుము కత్తి క్రిందపడును. దూరమున ఆఫ్రిదు నిలుచును)

రుస్తు—నేను వట్టిచేతులతో పోరెదను; నీ కత్తిచే నాకంఠము నుత్తరింపుము; నీరునివలె ప్రాణముల త్యజింతును.

సోరా—అధర్మయుద్ధమునకు కడంగువాడ కాను. ఇదే నా శస్త్రమును వీడెద. బాహుయుద్ధమున పెనంగుదము.

ఆఫ్రి—ధన్యోసి, ధన్యోసి- సోరాబూ! ఏమి నీమహాత్వము! ఏమి ఔదార్యము! ....ఇంక చూచెద. చంపు రుస్తుమ్, రుస్తుమ్! (సోరాబు పక్కలచూచుచుండ రుస్తుము వాని బడద్రోయును.)

సోరా—ఆ! ఆ! (క్రిందపడును)

రుస్తు—(గుండెమీద కూరుచుండి) తండ్రిని తల్లిని తలచుకొనుము. బాలకా! ఇదే నీకు మరణ మాసన్నమాయెను.

సోరా—ఇది తొలిసారి కదా? మా ద్వంద్వయుద్ధ నియమ మేమయ్యె? రెండవసారి కదా చంపవలయు.

రుస్తు—ఇదే తొలిసారి, ఇదే కడసారి (పొడుచును.

సోరా—అబ్బా! చచ్చితి! చచ్చితి! అమ్మా-అమ్మా అబ్బా! అబ్బా!

రుస్తు—చావుము. నా గర్వమును ఖర్వము చేయనెంచితివా? చావు- (ఒకసారిపొడిచి పోవును.)



ఆఫ్రి—పితృఘాతీ! చావుము. ఇదే నా చేతులను నీ రక్తమున రంజిత మొనర్తును- (అట్లుచేసి) ఇదే నీ రక్తము- గోరువెచ్చగా నున్నది. దీనితో నేడు నా తండ్రిమృత్యువునకు ప్రతిశోధ పూర్ణ మాయెను.

సోరా—ఆఫ్రిద్, నన్ను క్షమింపుము.

ఆఫ్రి—సోరాబూ! సోరాబూ! నీవు వీరచూడామణివి- ఉదారుడవు, మహాత్ముడవు.... అన్యాయ యుద్ధమున అలయింప బడితివి...దివమున కేగుచుంటివా? నేను నీ వెంట వచ్చెదను. నిన్ను విడుతునా? ఏదీ ఒకసారి నా వైపు చూడు. ధన్యోస్మి! నీ చరణదాసి నీతోడ వచ్చుచున్నది.

(పొడుచుకొనును)

సోరా—ఎంత పని చేసితివి!

ఆఫ్రి—ఉచిత కృత్యమునే చేసితిని. నిన్ను వలచి నా ప్రాణము నీ యధీనముచేసి, నిన్నే నాథునిగా భావించితిని. ఇంతవఱకు మనకిద్దరికి మధ్య నా తండ్రి మృత్యువను మహావ్యవధాన ముండెను, కావున జీవము లుండునంతవరకు నిన్ను చేరుకొన జాలకుంటిని. అది నేడు పోయె, కావున మృత్యుసుఖమున నిన్ను కలుసుకొంటిని, పతికి సతి తోడునీడ కాదా? వేగుచున్నప్పుడు నీ నీడ నీ వెంట రావలదా? ప్రాణకాంతా, నన్నొకసారి కౌగిలింపుము. ఇదియే తొలికౌగిలి, ఇదియే

సోరా—ప్రాణేశ్వరీ! నా జీవితసంధ్యను నిన్ను నా దానిగ జేసుకొనుచున్నాను. నీవే నా సర్వస్వమవు.

ఆఫ్రి—ప్రియతమా! నా కన్నులు చీకట్లు కమ్ము చున్నవి...ఏదీ నీ కరము! ప్రాణేశ్వరా! ఇదియే మన కేక దివసము...(మృతినొందును.)

సోరా—వీరనారీ! ప్రాణాధికా! నీ వెనువెంటనే వచ్చెద.

(రాజు రుస్తుమును వత్తురు.)

రుస్తు—ఇందే బాలవీరుడు భూశాయి యైనాడు.

రాజు—ధన్యోస్మి! నేడు పారసీకము నిరాపద మైనది. వీరోత్తమా! గాఢాలింగన మిమ్ము...(పోవును.)

సోరా—వీరాగ్రేసరా! నీ వెవడవో చెప్పవైతివి. ఎవరి నడిగినను చెప్పలేకుండిరి...అన్యాయ యుద్ధమున నన్ను జయింప గలిగితివి. ఈ విషయము నా తండ్రి యగు రుస్తుము చెవుల సోకెనా నిన్నాతడు విడువడు. నీవు గాఢాంధకారమున కాని, భూగర్భమున కాని, ఆకాశమున కాని, జలధికందరము యందు కాని-ఎచట తలదాచుకొనినను, నా తండ్రి నా మృత్యువార్త వినినతోడనే ఈ యన్యాయమునకు ప్రతీకారం కావించి తీరును. ఉద్ధతమగు నీ శిరము క్రింద దుం మానదు.

రుస్తు—ఏమంటివి? నీ తండ్రి ఎవరు?

సోరా—భువనైకవిఖ్యాత వీరుడగు రుస్తుము నాతం



రుస్తు—నీ తల్లి?

సోరా—తురాను రాజకుమారి తామినా. అమ్మా! అమ్మా! ఏ సమయమున నిన్ను గాంచలేకపోయితిని కదా! తండ్రి అన్వేషణమున నిట వచ్చితిని-కాని ఆతని చూడకముందే జీవితకాల మస్తమించెను.

రుస్తు—అసంభవము. ఇతడు నా పుత్రుడా! నాకు కొడుకు లేడే! సర్వాబద్ధము.

సోరా—నీ వెవడవు? ఇంకనైన చెప్పరాదా?

రుస్తు—రుస్తుమును నేనే.

సోరా—రుస్తుమా! నా హృదయమున కసత్యము స్ఫురింపలేదు. నిన్ను చంప చేతులాడకుండె! హా జనకా జనకా

రుస్తు—నీ వాతనిసుతుడవైనట్లు నిదర్శన మున్నదా?

సోరా—పై వస్త్రమును తొలగించి చూడుము. కవచ మున్నది.

రుస్తు—(చూచి) కవచ మదియే.... ఎంతఘోర మొనర్చితిని. కన్న కొడుకును కడుపున బెట్టుకొంటిని. అన్యాయ యుద్ధమున—హా పుత్రకా! సోరాబూ! సోరాబు సోరా....హా జనకా!

(త్వరగా తామినా వచ్చును)

తామి—ఏడీ నాపుత్రుడు?

సోరా—అమ్మా! అమ్మా!

తామి—ఎంత ఘోరమాయెరా! నాయనా! ఎట బోవుచుంటివి?

రుస్తు—తామినా! పుత్రుని నేను చంపితిని.

సోరా—అమ్మా, నాకు సెలవిమ్ము—నేను దూర దేశమరుగుచుంటిని-అంధకారమున చొచ్చుచుంటిని-తలిదండ్రు లారా! నాకు సెలవొసంగుడు—(మృత్యువు)

తామి—నాయనా! ప్రాణాధికపుత్త్రా! సోరాబూ!

(మూర్ఛపోవును)



## తొమ్మిదవ రంగము

రుక్తె—(కరగట్టి నిల్చును)

తామి—అయినదేమో అయినది. ఇంటికి నడువుడు. ప్రభూ! దీర్ఘమగు రాత్రి నీరవమై నశించిపోవ ప్రాతఃకాల మావిర్భవించెను. నిశ్చలభావమున నిట్లే నిలిచియుంటిరి. ప్రభా తము క్రమక్రమముగా పెరిగి తిరుగ గాఢాంధకారమున నదృ శ్యమాయెను-నిశ్చలభావమున నిట్లే యుంటిరి. ఇప్పుడు ఆ యంధకారము నావరించి వాన, గాలి, ఉరుములు, మెరుపులున్న చెలగుచున్నవి. అప్పటికిని నిశ్చలులై యుంటిరి. రెప్పపా లేదు—ఇట నే మున్నది-రండు పోవుదము-(చేతిని పట్టి



అయ్యో! ఏమిది! చలనము లేదు! పాషాణప్రతిః అటలము! అచలము! చెవి వినిపించదు—కన్ను కనిపించ రెప్పపాటు లేదు-హా! ప్రాణేశ్వరా! ఏమి యీతీరు! చూపు మాత్రమే కలదు-వేరేమియు లేదేమి?

(కైకాయుశు మంత్రియు వత్తురు.)

మంత్రి—మహారాజా! చూడుడు! ఈ గాఢాంధ కారమున! ఈ మెరుపులలో! ఈ గాలివానలో! ఈ యుగ ములలో అప్పటినుండియు నట్లే నిలువబడియున్నాడు-శి లాపము! ఒంటి నిండ నీటిధారలు! ఏడిన కేశపాశము! ప్రస్తరమూర్తి! అనిర్వాచ్యమగు పరితాపము పుంభావము నొందె! ఆతని పదకమలముల చెంత ఆక్రందన మొనర్చు పతివ్రతయు ఆతని సతియునగు తామినా పుత్రశోకవిహ్వ లయై మోకరించి యున్నది.

సైకా—రుస్తుమ్! రుస్తుమ్! మాట వినబడదు మనము కనబడము! కన్నులు మాత్రము మూతవడుట లేదు! శూన్యదృష్టి! కేవల దృష్టిమాత్రమే ఉన్నది— స్వస్తి స్వస్తి, స్వస్తి.

(తెరవాలును)

Saraswati Nike... Acc. No



